# సముద్రం

కథల సంపుటి



వేదగిరి రాంబాబు



నాగరాజు పబ్లికేషన్స్
S. F. T3-81, ఎన్. జి ఓ కాలనీ,
వనస్థలిపురం, హైదరాబాను - 500 661.

SAMUDRAM—SHORT STORIES
By Vedagiri Rambabu

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థికసాయంతో
ఈ పుస్తకం ప్రచురించబడింది.

First edition : October, 1991

**Price : Rs. 20/-**

Cover and illustrations:
ANAND. A.V.B.S.

Cover printed at
GRAPHICS DEN
Himayathnagar,
Hyderabad - 29.

Printed at :
Padmavathi Art Printers,
1-1-517/B/1. New Bakaram,
Gandhinagar. Hyderabad-380
Phone : 68413.

# జైలుగోడల మధ్య

* తలని పగలగొట్టి మెదడుని తినేవాళ్ళు వుంటారా?
* డ్రాక్యులాలా రక్తంపీల్చే మనుష్యులూ మనమధ్య వున్నారా?
* ఇల్లరికం రమ్మనడమే తప్పా?
* తండ్రిని చంపే తనయులూ ఎందుకు తయారవుతున్నారు?
* కన్నకూతుర్నే దారుణంగా మానభంగం చేసే తండ్రులూ వుంటారా?
* ఆశ మితిమీరితే...?
* అక్రమ సంబంధాలే అధిక నేరాలకు కారణాలా?
* పిల్లలు నేరస్థులుగా మారడానికి కారకులు తలిదండ్రులేనా?
* నగ్నదేవత మూడవ అవతారం.
* పిల్లలకి దూరమై పిల్లల్నే చంపిన తల్లి!
* జైళ్ళు శిక్షాసంస్థలు కావు- శిక్షణా సంస్థలా?

నేరస్థుల వెనుక దయనీయ గాథలని వెలికితీయడంతోపాటు రక రకాల జైళ్ళలో నేరస్థుల్ని ఎలా సంస్కరిస్తున్నారు? మరణశిక్షని ఎదుర్కొన్న ఖైదీల ఆఖరి క్షణాలు... నేరాలకి కారణాలు, వాళ్ళ సంస్కరణకి చేపట్టాల్సిన కార్యక్రమాలు మొదలైన ఎన్నో విషయాల్ని వేదగిరి రాంబాబు వివరంగా చర్చించిన సచిత్ర పుస్తకం.

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్
మ్యూజియమ్‌రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ-2.

# ముందుమాట

బందరులో డిగ్రీ చదువుకునే రోజుల్లో శ్రీయుతులు విహారి, ఆదివిష్ణుగారల పరిచయమే నన్ను రచయితగా మార్చింది. హైద్రాబాద్‌కి చేరుకుని యర్రశెట్టి శాయిగారి పరిచయంతో రచయితగా స్పీడ్ పెరిగింది. వీళ్ళ ముగ్గురికీ నేనెప్పుడూ ఋణపడే వుంటాను.

కథలు రాయడం ఒక ఎత్తు. అవి పాఠకులకు చేరడం ఒక ఎత్తు. ఈ రెండవ కార్యక్రమంలో తోడ్పడి నాకెంతో ప్రోత్సాహాన్నందించిన ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ వీరాజీ, ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ సి. కనకాంబరరాజు, స్వాతి సంపాదకులు శ్రీ వేమూరి బలరాం గార్లకు నేనెంతో ఋణపడి వున్నాను. ఈ సంపుటిలోని కథలను ముందుగా తమ పత్రికలలో ప్రచురించిన ఆయా పత్రికల సంపాదకులకు; కథా సంపుటికి అందమైన ముఖచిత్రాన్ని వేసి ఇచ్చిన మిత్రుడు ఆనంద్‌కు; ఈ పుస్తకాన్ని బయటకు తీసుకురావడంలో సహకరించిన మిత్రులు శ్రీయుతులు మల్లేశ్వరరావు, చొక్కాపు వెంకటరమణ, గోపీనాథ్, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీనివాస్ గారికి నా కృతజ్ఞతలు. ఈ కథల మీద మీ అమూల్యాభిప్రాయాల్ని తెలియజేయడం మరచిపోవద్దూ -శలవ్.

- వేదగిరి రాంబాబు
బ్లాక్ 3౩, ఫ్లాట్ 10 ఎమ్ఐజి II,
బాగ్‌లింగంపల్లి, హైద్రాబాద్-500044.

# ఆరోగ్యానికి మార్గాలు

ఆఖరివరకూ ఆరోగ్యంగా వుండాలనే అందరి ఆశ.

ఆరోగ్యంగా వుంటేనే ఏ కార్యాన్నయినా సాధించగల్గుతాం.

ఆరోగ్యానికి మార్గాలెన్నో వున్నాయి. అన్నిటి ఆశయం సంపూర్ణారోగ్యాన్ని సాధించడమే.

యోగా, సిద్ధ, ఆయుర్వేద, యునాని, హోమియోపతి, ఆక్యుపంక్చర్, ఆక్యుప్రెజర్, రిఫ్లెక్సాలజి, మాక్సిబుషన్, ప్రకృతి చికిత్స, రేడియానిక్స్, చిరో ప్రాక్టిక్ మొదలైన వివిధ వైద్య విధానాల సచిత్ర వివరణ.

వేదగిరి రాంబాబు పరిచయం

# ఆరోగ్యానికి మార్గాలు

# మా మనవి

మా పబ్లికేషన్స్‌ద్వారా వస్తున్న మొదటి పుస్తకం ఇది. వైవిధ్య మున్న విషయాలకు చెందిన, విజ్ఞాన దాయకమైన పుస్తకాల్ని వరుసగా తీసుకు రావాలని సంకల్పం నాలుగు శతాబ్దాల నగరం, అందరికీ ఆరోగ్యం మొదలైన పుస్తకాలు రాబోయే వాటిలో ముందున్నాయి. కాల క్షేపంతో పాటు కొద్దో గొప్పో విజ్ఞానాన్ని అందించాలనే మా ప్రయత్నానికి మీ ప్రోత్సాహం ఎప్పుడూ వుంటుందని ఆశిస్తూ—

—దుగ్గరాజు నాగరాజు
(నాగరాజు పబ్లికేషన్స్)

# ఇందులో కథలు

ఆప్తమిత్రుడు, ప్రముఖరచయిత

యర్రంశెట్టి శాయికి ప్రేమతో ఈ

కథాసంపుటిని అంకితమిస్తున్నాను.

\- వేద

# సముద్రం

బస్సు సముద్ర తీరానికి దగ్గరవుతున్నకొద్దీ చల్లని సముద్రపు గాలి ఆహ్లాదంగా స్పర్శిస్తోంది. బస్సులోపల చాలా కోలాహలంగా వుంది, అంతా స్త్రీలే కావడంచేత సన్నని గొంతులు ఆ సముద్రపు గాలి శబ్దంతో పాటు కలిసిపోయి, ఓ విధమైన సంగీతంలా వినబడుతోంది ఆ బస్సుకి ఒకవేపు 'ఉమన్స్ కాలేజ్, హైద్రాబాద్' అని రాసున్న పొడుగాటి గుడ్డ వేళ్లాడుతోంది.

రాణి మిగతావాళ్ళ గొడవలేమీ పట్టించుకోకుండా కిటికీలోంచి రోడ్డు కిరువైపుల అడవిలా పెరిగిపోయిన సరకు తోటల్నీ, మామిడి తోటల్నీ చూస్తూ కూర్చుంది. ఆమె మనసంతా గత స్మృతుల్తో సముద్ర కెరటాల్లా ఎగిసిపడుతోంది నిర్మానుష్యంగా వున్న రోడ్డుమీద సముద్రపు ఘోష వింటూ, సరకు తోటలు కమ్మే చీకటిలో - అప్పుడూ ఇలాగే సముద్రతీరానికి వచ్చింది తను!

అప్పుడూ ఇలాంటిదే బస్సు-కానీ అది గరల్స్ హైస్కూల్ బస్! అప్పుడు ఫోర్త్‌ఫారం క్లాస్ పిల్లలు ఎక్స్‌కర్షన్‌కి ఇక్కడికే వచ్చారు.

ఆ రోజూ ఇలాగే తను కిటికీ దగ్గర కూర్చుంది. తన్మయత్వంతో అందమైన ప్రకృతిని చూస్తుండిపోయింది.

బస్ వేగంగా మలుపు తిరగడంతో అంతవరకూ బస్ మధ్యలో నుంచుని, ఎవరినో అనుకరిస్తూ అందరినీ నవ్విస్తూన్న లెక్చరర్ శ్రీదేవి తూలి రాణి మీద పడింది. రాణి తుళ్ళిపడటంతో అందరూ ఘొల్లున నవ్వేశారు.

"లేకపోతే ఏమిటి! అందరం సరదాగా కబుర్లు చెప్పుకుంటూంటే; తను అమ్మమ్మలా మూల కూర్చుని మౌనవ్రతం పాటిస్తోంది!" అంది జానకి.

"ఈ సుందర దృశ్యాలు చూస్తూంటే తనువు, మనసు పులకరిస్తున్నా యేమో!" అంది శారద నవ్వుతూ.

"అందుకే పెళ్ళి చేసుకోవే అని చెప్తే వినదు!" తిరిగి జానకే అంది నవ్వేస్తూ.

రాణి చిరునవ్వు నవ్వి వూరుకుండిపోయింది.

* * *

సముద్రం స్పష్టంగా కనబడుతోందిప్పుడు.

సముద్రం వంక చూస్తుంటే గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్ రాణికి. మనసు అవ్యక్తమైన ఆనందంతో నిండిపోయింది.

అప్పటికీ, ఇప్పటికీ మధ్య పదిహేను సంవత్సరాలు!

అయినా ఏమీ మార్పు కనిపించలేదు. అవే తోటలు, అదే సముద్రం!

బస్ ఒక కొబ్బరితోట్టు దగ్గర ఆగిపోయింది.

అందరూ కిందకి దిగసాగారు. తనూ దిగి నించుంది రాణి. ఆ పిక్నిక్ బాధ్యత తీసుకున్న సుశీల బస్‌లో తినుబండారాల ప్యాకెట్సన్నీ వేరువేరుగా చేసి, స్వీటు, కారం వున్న ప్యాకెట్స్ అందరికీ పంచింది.

"డియర్ వుమన్!" అరిచింది బస్ ఫుట్‌బోర్డు మీద నిలబడి.

"ఏమిటి డియర్ మన్?" నవ్వుతూ అరచింది శ్రీదేవి.

"మీకు మాట్లాడుకోటానికి చాలా టైముంది. నేను చెప్పే మాటలు రెండు వినండి" అందామె ఏదో చెప్పడానికి సిద్ధమవుతూ.



"క్లాసులో పిల్లలకి కొట్టే బోరు చాలక మాక్కూడా ఇస్తున్నావా లెక్చరర్లు?" ఎవరో అన్నారు. అంతా గట్టిగా నవ్వేశారు.

"మీరు ఓ అరగంటసేపు ఇక్కడే వుండేటట్లయితే 'టీ' వేడిచేసి ఇవ్వడం జరుగుతుంది. తర్వాత మీ ఇష్టం. సాయంత్రం వరకూ సముద్రంలో జలక్రీడలు జరుపవచ్చు! సరకుతోట విహారాలు చెయ్య వచ్చు!..." అంతా చప్పట్లు కొట్టారు.

"నువ్వు పాలిటిక్స్‌లో కెళితే బాగా రాణించే దానివి" అంది జానకి.

మళ్ళీ నవ్వులు అలుముకున్నాయ్!

రాణి ఇదేమీ గమనించలేదు. ఆమె దృష్టంతా సముద్రం వైపే వున్నది.

అప్పుడూ ఇలాగే బస్ దిగారు.

తమ క్లాస్ టీచర్ హేమలత యిలాగే అందరినీ వరసాగ్గా నించోబెట్టి యెవ్వరూ దూరంగా పోకూడదని అంతా దగ్గర దగ్గర "గ్రూపులు"గా తిరగాలని ఆదేశాలిచ్చింది.

తనూ, సరస్వతి, శాంత, అలక- కలసి బయల్దేరారు. కాసేపు ఇసుకలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపారు. తర్వాత ఎవరు ఎక్కువ అందమైన సముద్రపు గవ్వలు, శంఖాలు ఏరుకొస్తారో నని పందెం వేసుకున్నారు.

అందరూ గవ్వలు, శంఖాలు ఏరడానికి బయలుదేరారు.

ఒక్కసారిగా కోలాహలం బయల్దేరే సరికి రాణి ఆలోచనల్లోంచి బయటపడింది.

సరకు పేడు మంటలో 'టీ' మరిగిపోతోంది. అందరూ తలో గ్లాసూ అందుకుని 'టీ' తాగసాగారు.

రాణి-తనూ నెమ్మదిగా 'టీ' చప్పరించసాగింది.

పది నిముషాల్లో ఆ కార్యక్రమం ముగిసిపోయింది.

అంతా ఒక్కుమ్మడిగా సముద్రం వేపు నడవసాగారు. ఎవరి లోకంలో వాళ్ళు ఉత్సాహంగా మాట్లాడుకుంటూ, పరుగెడుతూ- ఆ ప్రాంత మంతా రంగురంగుల శీతాకోక చిలుకలు తిరుగుతున్నట్లుంది.

నెమ్మదిగా నడుస్తోంది రాణి.

అప్పుడూ ఇలాగే-తను గవ్వలు, శంఖాలు ఏరుకుంటూ ఎంత దూరం వెళ్ళిపోయిందో తనకే తెలియదు!

సముద్ర తీరం వెంబడి రెండు మూడు మైళ్ళు వెళ్ళిగాని వెనక్కి తిరిగి చూడలేదు. తను తెచ్చుకున్న సంచీ రకరకాల గవ్వలు శంఖాలతో నిండిపోయింది.

దగ్గరలో ఇసకలో నిలబడ్డ రెండు పడవల్ని చూసి స్పృహలో కొచ్చింది. అయితే ఆ పడవల్లో ఏముందో చూడాలనే ఉత్సాహం, కుతూహలం వెనక్కి తిరగనీయలేదు. వాటి దగ్గరగా నడచి ఓ పడవలోకి తొంగి చూసింది. లోపల తొట్టిలాగుంది. అడ్డంగా రెండు స్థంభాల్లాంటి చెక్కలు. నల్లనిరంగు పూసుంది. నెమ్మదిగా అంచు పట్టుకుని ఎక్కి, పడవలోకి దూకింది. చుట్టూ తిరిగి చూసింది. ఈ పడవల్లోనే పల్లెవాళ్ళు చేపలు పడుతారు కాబోలు! దూరంగా శిథిలావస్థలో వున్న ఓ పాక కనిపించింది. అక్కడెవరుంటారు? ఎవరూ వున్నట్లు కనిపించడం లేదు. పడవలోనించి దిగి ఆ పాకవేపు నడిచింది. ఓ పక్కకి ఒరిగిపోయివుందది. దానికి తలుపేమీ లేదు. లోపలికి తొంగి చూసింది తను. లోపల శుభ్రంగా చదునుగా వుంది. ఏ వస్తువూ కనిపించలేదక్కడ!

దూరంగా కనబడుతున్న మరో పడవ దగ్గరికి నడిచింది. అందులోకి తొంగిచూస్తూనే వులిక్కిపడింది. లోపల పడుకున్న కుర్రవాడ్ని చూసి భయపడిపోయింది.

తనని చూడగానే లేచి నించున్నాడతను. తనంత ఎత్తే వున్నాడు. వంటిమీద చొక్కాలేదు. పొట్టి నిక్కరు ఒక్కటే వేసుకున్నాడు.

ముందుకు పొడుచుకొస్తున్న ఛాతీ, మూతిమీద మొలుస్తున్న నల్లని మీసకట్టు, మెడలో ఆంజనేయస్వామి తాడు. ఉంగరాల జుట్టు, ఆకర్షణీయమైన కళ్ళూ-

"ఎవరు నువ్వు?" అడిగాడతను ఆశ్చర్యం నిండిన కళ్ళతో.

తను భయపడిపోయింది గానీ, అంతలోనే తేరుకుంది. "మా స్కూల్ వాళ్ళంతా సముద్రం చూట్టానికొచ్చాం. నేను గవ్వలేరుకుంటూ వచ్చాను."

"ఏ వూరు మీది?" అడిగాడతను.

"గుడివాడ."

"ఏం చదువుతున్నావ్?"

"ఫోర్తు ఫారం."

తన చేతి సంచిలోని గవ్వల్ని, శంఖాల్ని చూసి నవ్వాడతను.

"ఎందుకా పిచ్చివన్నీ భద్రంగా తీసుకెళుతున్నావ్?"

"చాలా బాగున్నాయ్ ఇవి."

"నా దగ్గర ఇంకా పెద్దవి వున్నాయ్! ఇంక బాగుంటాయికూడా!" అన్నాడతను.

"ఏవీ?"

"ఇక్కడెందుకుంటాయ్? మా ఇంట్లో వున్నాయ్."

"మీ ఇల్లెక్కడ?"

"అదుగో అటు చాలాదూరం నడుస్తే కనబడుతుంది." సరకు తోటల్లోకి చూపిస్తూ అన్నాడతను.

తనకి ఆశ కలిగింది. అతని దగ్గరున్న గవ్వలు, శంఖాలు తనకిస్తే బాగుండునని- కాని అడగలేకపోయింది.

అప్పటికే ఆకాశం పూర్తిగా మేఘావృతమైపోయింది. తనసలు చూసుకోనేలేదు!

వెళ్ళిపోడానికి వెనక్కి తిరిగింది తను. సన్నగా వర్షం మొదలైంది.

"ఏయమ్మాయ్!" వెనకనించి పిలిచాడతను.

"ఏఁవిటి?" వెనక్కి తిరిగి చూసింది తను.

"అటు సముద్రంవేపు చూడు! పెద్దగా వర్షం వస్తోంది; నువ్వు తడిసిపోతావ్!" అన్నాడు సముద్రం వేపు చూపిస్తూ.

అటు వేపు చూసింది తను!

సముద్రంలో దూరంగా పెద్ద గాలి, దుమారం లేచినట్లు కనబడుతోంది. ఇప్పుడు తనేమిటి చేయడం? వర్షంలో తడుస్తూనే పరుగెట్టాలా? ఆలోచిస్తూ అక్కడే నిలబడి పోయింది. మరు నిముషంలో పెద్ద పెద్ద చినుకుల్తో వర్షం రానే వచ్చేసింది.

"ఏయ్! ఇక్కడకు రా! లేకపోతే తడిసిపోతావ్!" గుడిసె వేపు పరుగెడుతూ అన్నాడతను. ఇంకో ఆలోచన లేకుండా తనూ అతని వెంబడి పరుగెత్తి పాడుబడ్డ గుడిసెలోకి జేరుకుంది.

వర్షం బాగా విజృంభించింది.

పాకకూడా ఒకపక్క కారడం మొదలుపెట్టింది. అంతవరకూ అందంగా, పరవశం కలిగించిన ప్రకృతి చీకట్లు కమ్మగానే భయంకరంగా కనిపించసాగింది.

"నీ పేరేంటి?" అడిగాడు తను.

"రాణి"

"ఓహో!

''నువ్వూ చదువుకుంటున్నావా?'' అడిగింది తను ఒంటరితనం భరించలేక.

''వుహూ! నాలుగో క్లాస్ చదివి మానేశాను.''

''ఎందుకు?''

''మరి మా నాన్న చేపలు పట్టడానికి వెళ్తాడుగా! సహాయం చెయ్యద్దూ?''

''చేపలెప్పుడు పడ్తారు?'' ఉత్సాహంగా అడిగింది తను.

''నిన్న రాత్రి వెళ్ళారు! ఇవాళ సాయంత్రానికల్లా రావాలి మరి!''

''అమ్మో! రాత్రంతా సముద్రంలోనే వుంటారా?''

''ఒక్కోసారి రెండు మూడు రోజులు కూడా వుండిపోతారు.''

తను ఆశ్చర్యపోయింది.

అతను తను కూడా తన తండ్రితో సముద్రంలోకి వెళ్ళడం - ఒకసారి తమ పడవ ఎలా తిరగబడిపోయిందీ - తాము ఎట్లా బ్రతికి బయటపడిందీ - అన్నీ కళ్ళకు కట్టినట్లు చెబుతుంటే తనను తను మర్చిపోయి వినసాగింది రాణి.

బయట వర్షం ఎప్పుడాగిపోయిందో తెలీలేదు.

''అరే! వర్షం ఆగిపోయింది!'' అన్నాడతనే, ముందు బయటకి నడుస్తూ. తనూ గుడిశలోంచి బయటకి నడిచింది రాణి.

''నేను వెళ్తాను'' అంది అతన్తో.

''అలా మా ఇంటికి రారాదూ! నీకు నా శంఖాలూ - గవ్వలూ ఇస్తాను.''

''త్వరగా వెళ్ళి వచ్చేయగలమా?''

''నీ కెందుకు? అరగంటలో వచ్చేస్తాం!''

''అలాగయితే పద!'' ఆశతో అతని వెనకే నడుస్తూ అంది

సరకు తోటల్లో అతని వెనకే - అతనంత వేగంగా నడవడం కష్టంగానే వుంది తనకు. సరకు తోటలు దాటి, కూరగాయల తోటల్లోకి వచ్చారిద్దరూ.

''అదిగో! ఆ చెట్ల మధ్య పాకలేదూ-అదే మా ఇల్లు!'' అన్నాడతను.

తనకు ఎంతో బావుందా ఇల్లు! తోటలు-మొక్కల మధ్య బొమ్మను చూస్తున్నట్లుంది.

ఇంటి చుట్టూ కూడా కాయగూరలపాదులు అల్లుకుపోయివున్నాయ్.

ఇంట్లోకి వెళ్ళి మరుక్షణంలో తల బయటికి పెట్టి ''రా! లోపలకు!'' అని తనను కూడా పిలిచాడు.

సంశయంతో లోపలకు నడిచింది.

ఓ గూట్లోంచి రెండు పెద్ద అందమైన గవ్వలు, నాలుగు పొడుగ్గా, రంగురంగు చుక్కల్తో గాజులా మెరిసిపోతున్న శంఖాలు తీసి తనకిచ్చాడు.

''చాలా?'' అన్నాడు ఆనందంగా.

''ఓ! చాలు!'' అంది తను వాటన్నిటినీ సంచీలో వేసుకుంటూ.

''ఇంక వెళ్దామా?'' అడిగింది అపని పూర్తయాక.

''పద!''

ఇద్దరూ తోటల వెంబడి నడవసాగారు.

చెట్లపై నించీ వర్షపు నీరు చుక్కలు చుక్కలుగా మీద పడుతోంది. అక్కడ గుంటల్లో నీళ్ళు నిండివున్నాయ్! రంగురంగుల కప్పలు, కీటకాలు మొదటిసారిగా చూస్తోంది తను.

అతనితో వేగంగా నడవలేక తనకి ఆయాసంగా వుంది.

దూరంగా తమ క్లాస్ పిల్లలు చిన్నగా కనబడుతున్నారు. బహుశా తను కనిపించలేదని కంగారుపడుతూంటారు.

''అరుగో-వాళ్ళతోనేగా నువ్వు వచ్చింది?'' ఆగి తన వంక చూస్తూ అడిగాడతను.

''అవును! ఇంక నేను వెళ్ళిపోగలనులే" అంది తను.

అతను దగ్గరగా వచ్చాడు. ''నువ్వు ఇక్కడ నాతో ఉండిపోతే బాగుంటుంది'' అన్నాడు దీనంగా.

తను ఉలిక్కిపడింది.

అదేమిటి? అతనితో ఎలా వుంటుంది? హఠాత్తుగా గుండెల్లోంచి ఏదో తెలీని బాధ దూసుకొచ్చింది. అతన్ని వదిలి వెళ్ళాలంటే ఏంటోగా వుంది తనక్కూడా! కొద్ది గంటల పరిచయం అంతే!

అయినా అతన్ని వదిలి వెళ్ళాలనిపించడం లేదు తనకి. అతని కళ్ళలోని ఆకర్షణ - అతని అమాయకత్వం అంతగా ఆకర్షించాయ్ తనని!

"నిన్నోమాట అడగనా?" తిరిగి అడిగాడతను.

"ఏమిటి?"

"నీకు కోపం రాదుగా?"

"ఊహూఁ...ఏమిటో చెప్పు!"

"మనం ఒక్కసారి కావలించుకొందామా?''

బిత్తరపోయింది తను. ఇదేమిటి ఇలా మాట్లాడుతాడీ అబ్బాయ్!

"ఛీ! తప్పుకదూ?" భయంతో అంది తను. కాని అప్పటికే తన మనస్సు తిరగబడుతోంది. వంపులు తిరిగిన అతని శరీరాన్ని తనకు అదుముకోవాలనీ - ఇంకేమో చెయ్యాలనీ —

"సరే పోనీలే, వెళ్ళిపో!" భయంతో వెనక్కి తగ్గాడతను.

తను కదల్లేకపోయింది.

ఒక్కసారి కౌగిలించుకుంటే తప్పేముంది? తనకోసం పాపం ఇంత శ్రమ పడ్డాడు!

"ఇలా రా!" పిలిచిందతన్ని.

అతను దగ్గర కొచ్చాడు.

అతని మెడచుట్టూ చేతులు వేసి కౌగలించుకుంది తను. ఇద్దరి ఎత్తూ ఒకటే కావడంతో ఇద్దరి పెదాలూ కలుసుకున్నాయ్. మొట్టమొదటి కౌగిలింత అది. అంతకుముందు స్త్రీ పురుషుల కౌగిలింతలు, ముద్దులు సినిమాలోనే చూసింది తను. ఆ కౌగిల్లోని మాధుర్యమేమిటో అప్పుడే అర్థమైంది తనకి. అతని కంటే తనకే ఉద్రేకం ఎక్కువయిపోయింది.

"ఇంకా చాల్లే!" అన్నాడతనే వదిలేస్తూ.

తను సిగ్గపడి అతన్ని వదిలేసింది.

కొద్ది క్షణాలు ఒకరువంక ఒకరి వేగంగా స్పందించే గుండెలతో చూసుకుంటూ నిలబడిపోయారు.

"ఇంక వెళ్తానేం!" అంది తనే సిగ్గుతో.

"మళ్ళీ ఎప్పుడొస్తావ్?"

"ఏమో? బహుశా వచ్చేఏడుకూడా ఇక్కడికే ఎక్స్‌కర్షన్‌కి వస్తాం."

"ఎప్పుడయినా సరే-వస్తే మా ఇంటికి వస్తావా?"

"తప్పకుండా వస్తా!"

"ఇదిగో ఈ దండ కావాలా?" మెడలోని పూసలదండ తీసి అతని కిస్తూ అందామె.

అతను సంతోషంతో అందుకున్నాడది.

"నువ్వు మళ్ళీ వచ్చాక చూపిస్తాను దీన్ని" అన్నాడు నవ్వుతూ.

అతని కళ్ళనిండుగా నీరు చేరుకోవడం తను గమనించింది. తన కంటి నీళ్ళతో అతను మసకగా కనిపించేంతవరకూ చూసి తను అక్కడ్నించి నడవసాగింది.

అంతే! పదిహేను సంవత్సరాలు గడిచిపోయినయ్...

ఆ అనుభూతి తన మనసులో భద్రంగా అలాగే వుండిపోయింది. ఆ మరుసటి సంవత్సరం హైద్రాబాద్‌కి తాము ట్రాన్స్‌ఫర్‌లో వెళ్ళిపోవడం- అక్కడే సెటిలయిపోవడం జరిగింది. ఎప్పటికైనా ఓసారి అక్కడకి రావాలనీ, అతన్ని చూడాలని తన కోరిక! ఆ కోరిక ఇన్నాళ్ళకి నెరవేర బోతుంది. అసలిక్కడికి రావడానికి తన ప్రోద్బలమే కారణం. తమ టూర్ ప్రోగ్రామ్‌లో ఈ ప్రదేశం లేనేలేదు.

తీరం వెంబడే నడవసాగింది రాణి. అప్పటికే అందరినీ వదిలి చాలా దూరం వచ్చేసింది.

ఎండ బాగానే వుంది కాని చల్లగాలికి వేడి సోకటం లేదు.

దూరంగా నల్లని బోట్లు కనిపించాయామెకి. ఉత్సాహం ఇనుమడిం చిందామెకి. త్వర త్వరగా నడిచి ఆ బోట్లలోకి తొంగి చూసింది. ఎవ్వరూ లేరు!

అక్కడికి దగ్గరగానే సరకు తోటల్నానుకొని కొత్తగా వేసిన పాక కనబడుతోంది. ఆ పాకలోనే తను, అతను వర్షం పడుతుంటే తలదాచు కున్నారు.

పాక వెనక నించే కాలిదోవ వుంది. ఆ దోవ వెంబడే తాము అత నింటికి వెళ్ళారు.

త్వరత్వరగా నడవ సాగింది రాణి.

ఒకవేళ ఆతను కనిపిస్తే తనేం మాట్లాడుతుంది? అతన్నెలా గుర్తు పడుతుంది? అసలతను తన్ని గుర్తిస్తాడా?

అవేమీ ఆలోచించదలచుకోలేదామె!

దూరంగా కాయగూరల తోటలు - ఆ ఇల్లు కనబడుతూనే వుంది! అవే చెట్ల మధ్య బొమ్మలాగా వుందింకా! అయితే రంగులు రంగులు కన బడుతున్నా యింటికి. ఆ ఇంటి దగ్గరకి నడిచింది రాణి. ఆమెకు చెమ టలు కారిపోతున్నాయ్! కర్చీఫ్ తీసి తుడుచుకుంటూ ఇంట్లోకి చూసింది.

గడప కెదురుగా ఏడెనిమిదేళ్ళ పాప కూర్చుని ఆడుకుంటోంది పాప మెడలో తన పూసల దండ! పూసలన్నీ నల్లబడిపోతున్నాయ్!

తనని ఆశ్చర్యంగా చూసింది పాప! పాప మొఖంలో అతనే కన బడుతున్నాడు రాణికి.

"ఏమిటి?" అడిగింది పాప.

"మీ నాన్నేడి?" సర్దుకుంటూ అడిగింది రాణి.

"ఎల్లిపోయాడు."

"ఎక్కడికి?"

"సముద్రానికి."

"మీ అమ్మేది?"

"అమ్మ - మరే - పొలానికెల్లింది."

ఆ పాపని ఎత్తుకొని ముద్దు పెట్టుకుంది రాణి.

తన చేతిలోని స్వీట్ల పొట్లాం పాప కిచ్చింది.

"మీ నాన్న వస్తే రాణి వచ్చి వెళ్ళిందని చెప్పు."

''రాని నేను'' అంది పాప బుంగ మూతి పెట్టి.

రాణి చలించిపోయింది. ''నీపేరు రాణా?!''

"అవును. మా నాన్న రానీ అని పిలుస్తాడు. మా అమ
అంతే!"

మరోసారి పాపని ముద్దాడి అక్కడ్నించి బయల్దేరింది రాణి

పాప పాకెట్‌లోంచి లడ్డూ తీసి తింటూ రాణివంక చ
చేయి వూపింది రాణి నవ్వుతూ.

ఆమెకి ఎంతో సంతోషంగా వుంది. అతన్ని చూడక
ఫరవాలేదు. కాని అతనికి తను గుర్తుంది! అతని మనసులో
అంతే! అంతే తనక్కావలసింది. సముద్రతీరం వెంబడే పరుగె
రాణి. సముద్రపు అలలు వువ్వెత్తున ఎగిసిపడుతూ - లడ్డుని
వెనక్కి వెళ్ళిపోతున్నాయ్!

(ఆంధ్రసచిత్ర వారపత్రిక 1978 దీపావళీ కథ
బహుమతి పొందిన కథ.)

# పెళ్ళికూతురు

ఆ గుడి అంతా చాలా హడావుడిగా తయారైంది క్షణాల్లో! ఆడ పెళ్ళివారు వచ్చేసి గుడిలో ఆ ఉదయమే ఏర్పాటు చేసిన పందిరంతా ఆక్ర మించేశారు. అరుగులమీదా, కోనేటి దగ్గరా- ఎక్కడ చూచినా రంగు రంగుల చీరలే! అప్పటి కప్పుడు ఈ విషయం తెలుసుకొని గుడి బయట ఇద్దరు సోడాబళ్ళవాళ్ళు వచ్చేశారు.

గుడినానుకునే వున్న పెంకుటింట్లోంచి పూజారి లక్ష్మీనరసింహాచారి పట్టుపంచె కట్టుకుని, ప్రక్కనున్న గోడతలుపు తీసుకుని గుడిలోకి ప్రవే శించాడు.

ఆ పెంకుటింటి కిటికీలోంచి ఇదంతా గమనిస్తున్న మయూరి నవ్వు కొంది.

ఆ గుడికి కళ వచ్చేది ఇలాంటప్పుడే! లేదా దేవుడి ఉత్సవాలు జరిగేప్పుడు! అంతే- మిగతా అన్నివేళలా కళాకాంతులూ, సందడీ లేకుండా వెలతెలబోయినట్లు కనబడుతుంది.

"ఈ గుళ్ళో పెళ్ళిచేసుకున్న వాళ్ళందరూ పిల్లాపాపలతోనూ, సిరి సంపదలతోనూ కళకళలాడిపోతుంటారు" అని అందరితో చెబుతుంటాడు తన తండ్రి.

కానీ ఆయనలా ఎందుకు చెప్తారో తనకు తెలుసు. మరికొంతమంది ఆ మాటలకాకర్షింపబడి వారింట జరిగే పెళ్ళిళ్ళ వేడుకలు ఆ గుడిలోనే చేయాలని ఆయన ఆశ! ఏదేమైనా ఆ పెళ్ళిళ్ళ వేడుకలు ఈ కిటికీలోనే కూర్చుని కనులారా తిలకించడం తనకూ అలవాటైపోయింది.

పెళ్ళి ఎలా జరుగుతుందో తనిప్పుడు సులభంగా చెప్పేయగలదు. నిజానికి చాలావరకూ ఆ పెళ్ళి మంత్రాలు కూడా తనకి కరతలామలకం అయిపోయాయ్. వాళ్ళు ఒప్పుకోవాలేగాని తను పౌరోహిత్యం కూడా చేసేయగలదు. నవ్వు వచ్చింది మయూరికి.

పెళ్ళికూతురు కాబోలు ఓ మూలగా కూర్చొని స్నేహితురాళ్ళతో కబుర్లు చెబుతోంది. ఆమె వేపు పరీక్షగా చూసింది మయూరి

ఫరవాలేదు బాగానే వుంది. ధనవంతులమ్మాయిలాగానే కనబడుతోంది. మెరిసిపోయే నగలే చెపుతున్నాయా విషయం! అన్ని నగలుండాలేగాని తనంతకన్నా ఎక్కువగా మెరిసిపోగలదు.

అక్కడ జరిగే పెళ్ళిళ్ళన్నింటిలోనూ పెళ్ళికూతుళ్ళను తనతో పోల్చుకోవడం బాగా అలవాటైపోయింది.

అవును! తనూ ఓ రోజు అలానే పెళ్ళికూతురవుతుంది. తన వివాహం కూడా ఆ గుడిలోనే జరుగుతుంది. వరుడు కూడా మరెవరో కాదు...

ఈశ్వర్!

తనకి ఏడెనిమిదేళ్ళ వయసున్నప్పుడు మొదటిసారిగా పరిచయమైంది అతనితో.

తనప్పుడు కోనేటిగట్టున చెట్టుకింద బొమ్మలాట ఆడుకుంటోంది. వాళ్ళావూరికి కొత్తగా వచ్చారప్పుడు. తమ ఇంటికి రెండిళ్ళవతల వున్న మేడలో దిగారు. వాళ్ళ నాన్నకో మోటర్ సైకిలుండేది కూడా!

"ఏయ్! నేను కూడా ఆడతాను..." అన్నాడతను దగ్గరకొచ్చి నిలబడి.

తనకి వంటరితనం భరింప శక్యంగాకుండగా వుండటంవల్ల వెంటనే అందుకు అంగీకరించింది.



అంతే! ఆ రోజునించీ ఇద్దరూ జత. బడికి వెళ్ళడం రావడం, ఆడుకోవడం-అన్నీ కలిసే!

అతనూ తన వయసువాడే అయినా తను కూపస్థమండూకంలాంటి ఆ గుడి ఆవరణలోనే పెరగడంచేత అతను చెప్పే విషయాలన్నింటినీ

అలా నోరు తెరుచుకుని వింటూండేది. తన అమాయకత్వాన్ని అసరాగా తీసుకుని అతను విజృంభించి చెప్పే కొన్ని అబద్ధాలను కూడా నిజమని నమ్మేసేది.

తన దృష్టిలో పెద్ద మొనగాడిలా పెరిగిపోయాడతను. వేసవి శలవుల్లో మధ్యాహ్నమే తమింటికి వచ్చేసేవాడు. ఇద్దరూ కోనేటిగట్టుమీద నించి నడిచి ఆవతల వొడ్డుకి జేరి అక్కడ అడవిలా పెరిగిపోయిన చెట్ల మధ్యనించీ, గుబుర్లసందునుంచీ తిరుగుతూ అంతవరకూ తనెన్నడూ వెళ్ళలేకపోయిన కొత్త కొత్త ప్రదేశాల్ని చూస్తుండేవాళ్ళు. అలా చెట్ల గుబుర్లలో కెళ్ళడం తనకెంతో భయాన్ని కలిగించేది. కానీ అతను హీరో లాగా తన చెయ్యి పట్టుకొని లాక్కెళ్ళేవాడు.

ఓసారి అలా వెళ్తుంటే ఓ పెద్ద పామెదురైంది.

అంతే! ఇద్దరూ ఒకళ్ళ చేతిని మరొకళ్ళు గట్టిగా పట్టుకొని ఒకటే పరుగుతో గుడికి చేరుకున్నారు. ఆ తర్వాత మళ్ళీ ఎప్పుడూ అంతదూరం వెళ్ళలేదు; గుళ్ళోనే ఆడుకొంటుండేవాళ్ళు. గుళ్ళో పెళ్ళిళ్ళు జరుగుతూంటే తామిద్దరికీ ఎంత సరదాగా వుండేది!

తను లంగా, జాకెట్లు వేసుకోవడం మొదలుపెట్టాక అదివరకటిలా అతనితో తిరగాలంటే బిడియంగా వుండేది. అమ్మకూడా అదివరకటిలా ఇష్టంవచ్చినట్లు తిరగవద్దని ఆంక్షలు పెట్టింది.

అతను మాత్రం ప్రతిరోజూ తనకోసం వస్తూండేవాడు. కిటికీ బయటనే నిలబడి కాసేపలా వెళ్ళి ఆడుకుందాం రమ్మని వేధించేవాడు.

తల్లిని బ్రతిమాలి ఇద్దరూ గుడిలోనే అరుగుమీద కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకునేవాళ్ళు. అతనితో వుంటే అసలు సమయమే తెలిసేది కాదు!

ఓరోజు జరిగిన సంఘటన తనిప్పటికే కాదు ఎప్పటికీ మరచి పోలేదు.

ఆ రోజు తన తల్లీ తండ్రీ గుళ్ళో జరుగుతున్న పెళ్ళి హడావిడిలో వున్నారు.

మామూలుగా మిట్టమధ్యాహ్నం తనకోసం అతనొచ్చాడు.

"మీ అమ్మా నాన్నా ఇంట్లో లేరా?" ఆనందంగా అడిగాడు.

"ఊహూఁ...గుళ్ళో వున్నారు..."

"అలాగైతే మనం కోనేటి దగ్గరకు వెళ్ళి ఆడుకుందామా?"

"అమ్మో! అమ్మ చూస్తే...?"

"ఏం పర్లేదు. అందరూ ఆ పెళ్ళిసందట్లో వున్నారు." రమ్మని బలవంతం చేయసాగాడు.

కాసేపతనితో సరదాగా గడపాలని తనకీ వుంది. ఎంతోకాలమైంది, తామిద్దరూ ఆ చెట్ల గుబుర్లలో ఆడుకొని.

ఇద్దరూ పెళ్ళివాళ్ళ మధ్యనించి తప్పించుకొని కోనేటివేపు పరుగెత్తసాగారు. మంగళవాయిద్యాలు మ్రోగడం మొదలైందప్పుడే!

కోనేటి వొడ్డున కూర్చొని ఇద్దరూ చాలాసేపు పెళ్ళిగురించి కబుర్లు చెప్పుకున్నారు.

హఠాత్తుగా అడిగాడతను:

"మయూరీ! మనం కూడా పెళ్ళిచేసుకుందామా?"

"ఏంటి పెళ్ళా?"

"ఉత్తుత్తి పెళ్ళేలే..."

"ఛీ! పాడు."

"ఏం?"

"అమ్మో! ఎవరైనా చూస్తే..."

"ఇక్కడి కెవరొస్తారనీ? ఎవరూ రారు."

పైకి వద్దనేసిందే కాని నిజానికి తనకీ సరదా కలిగింది. మరు క్షణంలో ఇద్దరూ పెళ్ళికొడుకు, పెళ్ళికూతురుగా మారిపోయారు.

కోనేటి గట్టునే చెట్ల గుబుర్లో పెద్ద పెద్ద అరటి ఆకుల్ని పరచుకొని ఇద్దరూ కూర్చున్నా రెదురెదురుగా.

గుడిలో మంగళసూత్రం కట్టే సమయంలో వాయిద్యాలు పెద్ద ఎత్తున మారు మ్రోగినయ్.

వెంటనే అతను లేచి అంతకుముందే సిద్ధంగా వుంచుకున్న పసుపు దారం తన మెడలో కట్టేశాడు! ఆ తర్వాత ఎండిపోయిన చెట్ల ఆకుల్ని తలంబ్రాలుగా ఇద్దరూ ఒకరి నెత్తిన మరొకరు పోసుకున్నారు. తన పొట్టి లంగాకి, అతని నిక్కరుకీ ఓ తాడు ముడేసుకొని ఇద్దరూ తాము కూర్చున్న స్థలం చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యసాగారు. ఆ సమయంలో తన చిటికెన వేలును పట్టుకోవడం కూడా మరచిపోలేదతను! ఆ తర్వాత అంత వెల్తురులోనూ అతను తనకి అరుంధతి నక్షత్రం చూపించాడు. కనిపించిందని తను తలూపింది ...

ఆ పెళ్ళి వుత్తుత్తి పెళ్ళని తనకి తెలిసినా నిజంగానే తన పెళ్ళి జరుగుతోందన్నట్లు భావన కలుగసాగింది!

"ఇప్పుడు మనిద్దరం మొగుడూ, పెళ్ళాం అయ్యాం కదూ?" అడిగాడు ఈశ్వర్.

తనకి తెలీకుండానే విపరీతమైన సిగ్గేసింది. అప్పట్లో తనకి వివాహమంటే ఏంటో పూర్తిగా తెలీకపోయినా ఆ పవిత్రమైన బంధంలోని అనుభూతి కదిలించి వేసింది.

"ఏయ్! మాట్లాడవేం?" ఆప్యాయంగానే రెట్టించాడతను.

"మనం ఇలా చెయ్యడం తప్పు కదూ?..."

"ఎలా?"

"ఇలాగే..." ఆ తర్వాత చెప్పలేకపోయింది తను. ప
ఓ సరికొత్త ఆకర్షణ ప్రారంభమైంది తనలో.

"ఏయ్! అలా మూగదానిలా అయిపోయావేంటి?" తనకి
వచ్చి తాకుతూ అడిగాడతను.

అతని స్పర్శ తనలో వింత అనుభూతిని కలిగిస్తోంది!

తను నెమ్మదిగా తలెత్తి అతని కళ్ళల్లోకి చూసింది.
చూస్తున్నాడతను. ఆ చూపుల్లో విద్యుత్ ప్రవహించి నట్లయింది.
తల వాలిపోయింది. మధురస్మృతులు మనసుని కమ్మసాగాయ్..

అతని కౌగిట్లో నలిగిపోతున్నప్పుడు కాని తిరిగి తనకి
ప్రపంచం గుర్తుకు రాలేదు. లేకపోతే ఆ కౌగిలి తమనెంత దూ
కెళ్ళేదో! అంతవరకూ కలగాపులగంగా వినబడుతున్న మంగ
ద్యాలు ఆగిపోయి తమని పూర్తి స్పృహలోకి తెచ్చాయ్.

"ఏయ్! వదులు..." అంది తను భయంగా వెనక్కి త

ఈశ్వర్ కూడా భయపడిపోయాడు. చటుక్కున తనని
దూరంగా జరిగాడు.

"కోపం వచ్చిందా?" కొన్ని క్షణాల మౌనం తర్వాత
అడిగాడు.

"ఊహూఁ...లేదు...ఇంటికి వెళ్ళిపోదాం." గబగబా బయ
తను. వెనుకనే అతనూ వచ్చేశాడు.

దారిలో తనేమీ మాట్లాడలేదు. అతనూ మాట్లాడలేదు.

అ తర్వాత మూడు నాలుగు రోజులు తామిద్దరూ కలుసుకోనేలేదు. కానీ అతనంటే తనకున్న అభిమానం ఇదివరకటికన్నా రెట్టింపైందని మాత్రం తను గ్రహించింది.

సరిగ్గా అప్పుడే వాళ్ళ నాన్నగారికి వేరే వూరు ట్రాన్స్‌ఫరైంది.

వెళ్ళేముందు తన దగ్గరకొచ్చాడీశ్వర్.

అమ్మ వద్దని వారించినా వినకుండా అతని వెనకే బయల్దేరింది. ఇద్దరూ గుడిలోకొచ్చి కూర్చున్నారు.

"మేం రేపెళ్ళిపోతున్నాం." దిగులుగా అన్నాడతను.

తన కంతకుముందురోజు ఆ విషయం తెలిసినప్పట్నించే మన సంతా అదోలా అయిపోయింది. అతనలా అడిగేసరికి కన్నీళ్ళాపుకోలేక పోయింది.

"మళ్ళీ ఎప్పుడైనా వస్తావా ఇక్కడికి?" బొంగురుపోయిన గొంతుతో కళ్ళు తుడుచుకుంటూ అంది.

"పెద్దాడినయ్యాక తప్పకుండా వస్తాను. అప్పుడు మనిద్దరం గుళ్ళో అసలైన పెళ్ళి చేసుకుందాం."

తను చటుక్కున తలెత్తి అతని వేపు చూసింది. "నిజంగానే?!"

"అవును. మనం పెళ్ళిచేసుకుంటే ఎంతో బావుంటుంది కదూ? అప్పుడు మనం ఇంచక్కా అమ్మా నాన్నగార్లలాగా కలిసేవుండొచ్చు హాయిగా!"

"నువ్వు తప్పకుండా వస్తావా?"

"ఒట్టు..." తన చేతిలో చెయ్యివేసి గిల్లుతూ అన్నాడతను.

అంతే. అతను వెళ్ళిపోయి దాదాపు పదిహేను సంవత్సరాలు వస్తోంది. ప్రతిరోజూ అతనికోసం ఎదురుచూస్తూనే వుంది.

ఆ తర్వాత గుడిలో ఎన్నో పెళ్ళిళ్ళు చూసింది. ఏ పెళ్ళి చూసినా తన కళ్ళముందు మెదిలేది ఆనాటి తమ పెళ్ళి ఆటే.

గుళ్ళో జరిగే ప్రతి పెళ్ళిలోనూ పెళ్ళికూతురు తనే అయినట్లు, పెళ్ళికొడుకు ఈశ్వర్ అయినట్లు వూహించుకోవడం అలవాటైపోయింది.

"పిలుస్తుంటే పలకవేమే! ఇంక ఆ పెళ్ళి చూడ్డంలో పడితే ఇంట్లో పనే గుర్తుండదు నీకు..." తల్లి మాటలకి వులిక్కిపడి ఆలోచనల్లోంచి బయటపడింది మయూరి.

ఆమెకు తల్లిని చూస్తుంటే అభిమానం, ప్రేమ పెల్లుబికినై ఒక్కసారిగా! తల్లి అలా తనకెందుకు పని చెబుతుందో తనకి తెలుసు.

తన వయసు పెరిగిపోతుందనీ, తనకి పెళ్ళి చేయలేకపోతున్నామని తల్లిదండ్రుల బాధ. తనూ అలాంటి దిగులు పెట్టుకుంటుందేమోనన్న భయంతో పెళ్ళి చూడనివ్వకుండా ఆ రోజంతా ఏదో పని పురమాయిస్తుంది అమ్మ.

తనకు పెద్దగా చదువు లేదు. గొప్ప అందగత్తె కాదు. తమవాళ్ళకి మంచి కట్నం ఇచ్చే స్తోమతు కూడా లేదు. తన వివాహం ఎలా అవుతుంది?

ఒకవేళ ఎప్పటికైనా తనకి వివాహం జరిగితే ఈశ్వరతోనే జరుగుతుంది. ఆతను తన కిచ్చిన మాట నిలబెట్టడానికి ఏనాటికైనా తప్పకుండా వస్తాడని ఆశ వుంది. ఆ ఆశే తనకి బ్రతుకుమీద కోరిక కలిగిస్తోంది.

గుళ్ళో మంగళవాయిద్యాలు పెద్ద పెట్టున మారుమ్రోగుతున్నాయ్. వధువు మెడలో తాళి కడుతున్నాడు పెళ్ళికొడుకు.

మయూరి నెమ్మదిగా అక్కడినుంచి లేచి వెళ్ళి, తన పెట్టె తెరిచి-అందులో భద్రంగా దాచుకున్న సన్నని పసుపు దారం పైకి తీసి చూసుకొంది.

అది ఆనాడు ఈశ్వర్ తన మెడలో కట్టిన తాళి!

తనివి తీరగా ఓసారి మెళ్ళో వేసుకొని...దాన్ని భద్రంగా మళ్ళీ పెట్లో దాచి వంటింటివేపు నడిచిందామె.

'ఎప్పటికైనా ఈశ్వర్ తనకోసం వస్తాడు. తన కప్పుడే పెళ్ళవు తుంది!' ఆశగా అనుకొంది.

నిజానికి గుళ్ళో జరుగుతున్న పెళ్ళిలోని వరుడు తన ఈశ్వరేననీ, అతను ఆనాటి స్మృతుల్నీ, పెళ్ళినీ పిల్లలాటలాగానే మరచిపోయాడనీ-ఇప్పుడతను పెళ్ళి చేసుకుంటున్న అమ్మాయి వల్ల తన అంతస్థు మరింత పెరిగినట్లు భావిస్తున్నాడనీ-ఆమెకి తెలీదు. ఊహించలేదు కూడాను!

ఆమె పాలిట శాపమో, వరమోగాని మానసికంగానే కాకుండా, శారీరకంగా కూడా అతన్లో వచ్చిన విపరీతమైన మార్పు ఆమె కతన్ని గుర్తించే అవకాశం కలుగనీయలేదు. అతను గుర్తుకొచ్చినప్పుడల్లా అతని సరసన పెళ్ళికూతురుగా వూహించుకొని సిగ్గుపడిపోవడమే ఆమెకు తెలుసు. *

(యువ, అక్టోబరు 1979)

# రెండు లోకాలు

ఆ భవనం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. రంగురంగుల లైట్లు కనుల కింపుగా ఆ భవనాన్నంటుకుని వేళ్ళాడుతున్నాయ్. ఆ భవంతి ఆవరణలో కార్లు బారులు తీరి నిలబడుతున్నాయ్. హాల్లో ఏర్పాటు చేసిన కుర్చీల వరుసల్లో బోలెడుమంది స్త్రీలు కూర్చుని, తమ మధ్య ఆ ఇంటి కోడలు శ్రీలక్ష్మికి జరుగుతున్న సీమంత వేడుక చూస్తున్నారు. నిముష నిముషానికీ కూల్ డ్రింక్ సీసాలు అందిస్తున్నారు పనివాళ్ళు.

వేడుక ముగిసింది.

పెద్ద ఎత్తున స్వీట్లూ, హాట్లతో పార్టీ మొదలయింది. కొంతమంది రెండేసి ప్లేట్లు తింటున్నారు· కొంతమంది కొంచెం రుచి చూసి వదిలేస్తున్నారు.

ఆ భవనం యజమాని నిరంజనం మేడమీద కూర్చుని ఆనందంలో తేలిపోతున్నాడు. తన కొడుక్కి వివాహమై నాలుగేళ్ళయింది. ఇన్నాళ్ళకి ఇప్పుడు కోడలు గర్భవతయింది. అదే ఆయన ఆనందానికి కారణం. ఆయనేకాదు ఆ యింట్లోని సభ్యులందరూ తమ వంశాన్ని నిలబెట్టే ఆ చిన్నిపాపాయి రాకకోసం వేయికళ్ళతో ఆనందంగా ఎదురు చూస్తున్నారు. శ్రీలక్ష్మి ఆరోగ్యాన్ని రక్షించేందుకు ఇద్దరు లేడీ డాక్టర్లను నియమించారు. ఒక నర్స్‌కి తాత్కాలికంగా ఇంట్లో ఉద్యోగం ఇచ్చేరు. ఆమెని అడుగుపెట్టనీకుండా, అలసట చెందనీకుండా అన్ని ఏర్పాట్లూ చేశారు.

రాత్రి తొమ్మిదింటిగ్గానీ ఆ వేడుక తాలూకు హడావిడి తగ్గలేదు.

శ్రీకాంత్ భార్య శ్రీలక్ష్మిని ఆప్యాయంగా తమ గదిలోకి తీసుకెళ్ళిపోయాడు.

"ఈ పండుగతో బాగా అలసిపోయినట్లున్నావ్! విశ్రాంతి తీసుకో" అన్నాడతను.

శ్రీలక్ష్మి అలసటగా నవ్వింది.

మంచంమీద అలాగ్గా వాలింది.

"కూర్చుని కూర్చుని కొంచెం నడుం నొప్పిగా వుంది..." అంది చిన్నగా నవ్వుతూ.

శ్రీకాంత్ వెంటనే లేడీ డాక్టర్‌కి ఫోన్ చేశాడు.

"అబ్బే డాక్టరెందుకూ ఈ మాత్రానికే...వద్దండీ..." వారిస్తూ అందామె.

అతను వినిపించుకోలేదు.

"నీకు తెలీదు శ్రీలక్ష్మి! మన జాగ్రత్తలో మనం వుండడం మంచిది.'' సౌమ్యంగా అన్నాడతను.

*　　*　　*

ఆ భవనం ఎదురుగా శిధిలావస్థలో వున్న పాకల్లో కూడా ఆ రోజు సందడిగా వుంది. ఆ పాకల్లోని చాలామంది స్త్రీలు ఓ పాకదగ్గరకు చేరి, అక్కడ నులకమంచం మీద పడుకొన్న నాగమ్మ వేపు జాలిగా చూసి మాట్లాడుకొంటున్నారు.

నాగమ్మ బాధతో మెలికలు తిరుగుతోంది.

"కొంచెంసేపు ఓర్చుకోవే! అదే తగ్గిపోతుంది...'' ఓ ముసలమ్మ అంటోంది.



"అయిదో నెల వచ్చినప్పట్నించీ ఇలాంటి నెప్పులు మామూలేలే." మరో స్త్రీ సర్ది చెప్తూ అంది.

"ఒకవేళ కడుపు పోయినా మంచిదే." నాగమ్మ అత్త అంది.

ఆ రాత్రంతా నాగమ్మ భర్తా, అత్తామామలు నిద్రలేకుండానే గడిపారు. ఏ క్షణాన ఆమెకు గర్భవిచ్ఛిత్తి అవుతుందోనని క్షణమొక యుగంగా ఎదురు చూశారు ఆ రాత్రంతా. బాధతో మూల్గుతూనే వుంది నాగమ్మ.

"ఒకోళ్ళకి ఆ మందు వెంటనే పనిచేస్తుంది. అది వేసుకున్న గంటలో గర్భం పోతుంది. మరి మన రాతేంటో దీని కింతవరకూ ఆ సూచన కనిపించడం లేదు." దిగులుగా అంది అత్త.

వాళ్ళందరి వృత్తి రోడ్డు పక్కా— గుళ్ళు, సినిమాహాళ్ళ దగ్గరా కూర్చుని అడుక్కోవడం—

ఈ పరిస్థితుల్లో నాగమ్మ గర్భం ధరించడం అందరికీ గుండెల్లో రాయి పడింది. తమకే కడుపునిండా తిండి దొరకడం లేదు. ఇక ఆ పసిగుడ్డు బయటికొస్తే దానికెవరు పెడతారు?

తెల్లారేసరికి నాగమ్మ నొప్పులు తగ్గిపోయాయ్.

"ఇంకేం చేస్తాం... పద అడుక్కోవడానికి..." అన్నాడామె భర్త.

అలాగే లేచి, అతన్తోపాటే అడుక్కోవడానికి బయల్దేరింది నాగమ్మ.

* * *

శ్రీలక్ష్మికి నొప్పులు వచ్చాయ్. వెంటనే ఆమెను కార్లో అతి ఖరీదయిన ఓ నర్సింగ్‌హోమ్‌కి తీసుకెళ్ళారు. అక్కడ ఆమెను అంతవరకూ కనిపెట్టి వున్న లేడీ డాక్టర్లిద్దరూ కాక మరో స్పెషలిస్ట్ కూడా రప్పించబడింది. ఆ వేళంతా ఆమెని కనిపెట్టే వున్నారందరూ. ఎప్పుడో అర్థరాత్రికి కాని ప్రసవించలేదు శ్రీలక్ష్మి. అదీ సిజేరియన్ ఆపరేషన్ తర్వాత!

* * *

ఆరోజు నాగమ్మ బజార్లో అడుక్కుంటూంటే హఠాత్తుగా నొప్పులొచ్చాయ్. భరించలేని నొప్పులు.

ఆమె రోడ్డుపక్కనే పడి బాధపడడం చూసిన దారినపోయేవాళ్ళు ఓ రిక్షా మాట్లాడి, ఆమెను అందులో వేసి హాస్పిటల్‌కి పంపించారు. ఆమెను ప్రభుత్వ హాస్పిటల్ వరండాలో పడేసి వెళ్ళిపోయాడు రిక్షావాడు.

హాస్పిటల్ సిబ్బంది ఆమెను చూసి కూడా చూడనట్లు ఎవరి దారిన వాళ్ళు తిరగసాగారు.

నాగమ్మకి నొప్పులు అధికమయ్యాయి.

గట్టిగా కేకలు పెడుతూ అటూ ఇటూ తిరిగే నర్సులనూ, డాక్టర్లనూ ప్రతిమాలసాగింది.

చివరికి ఆమె ఆ వరండాలోనే మరో ముష్టిదాని సాయంతో ప్రసవించేసింది.

* * *

శ్రీలక్ష్మికి మగపిల్లాడు పుట్టాడు. అయితే ఆ పిల్లాడి కాళ్ళూ చేతులు చచ్చుబడిపోయివున్నాయ్. ఇది చూస్తూనే ఆ ఇంటివాళ్ళంతా నిరుత్సాహపడిపోయారు.

వెంటనే కార్లు స్పెషలిస్టుల దగ్గరకు పరుగెత్తాయ్.

డాక్టర్లు ఒకరి తర్వాత మరొకరు పరీక్షించి ఆ పాపాయిని విదేశాలకు తీసుకెళ్ళాలనీ, అప్పుడే ఆ పాపాయికి కాళ్ళూ చేతులూ సరిగ్గా రావచ్చనీ అభిప్రాయాలు వెలిబుచ్చారు.

వారం తర్వాత అలాంటి కేసులను నయం చేశాడని పేరుపొందిన ఓ బొంబాయి వైద్యుని దగ్గరకు విమానంలో బయల్దేరిందా కుటుంబం.

* * *

నాగమ్మకి ఆడపిల్ల పుట్టింది. పిల్ల ఆరోగ్యంగా వుంది. ఆ మర్నాడే మంచాలు ఖాళీ అవ్వాలని హాస్పిటల్ వాళ్ళు ఆమెను బయటికి గెంటేశారు. ఆ పసిగుడ్డును తీసుకుని నెమ్మదిగా ఇంటికి జేరుకుంది నాగమ్మ.

ఆమె అంత త్వరగా ఇంటికి రావడం ఆ ఇంటిల్లపాదికీ నచ్చలేదు.

"మరో రెండ్రోజులక్కడే వుంటే మంచి తిండి దొరికేదిగా!" అందామె అత్త దిగులుగా.

"వుంటానంటున్నా బయటికి తోసేశారు..." చిన్నగా జవాబిచ్చింది నాగమ్మ.

పాపాయిని అందరూ మూగి చూశారు. బొద్దుగా ఆరోగ్యంగా వుందా పిల్ల.

"ఏ వంకా లేని పిల్ల." నిరుత్సాహంగా అంది అత్త.

"మన కర్మం! మన పాక్కెదురుగా వున్న గొప్పోలింట్లో కాళ్లూ సేతులూ ఆడని బాబు పుట్టాడంట. దేవుడలాంటి పిల్లని మనకిస్తే ఎంత బావుండేది." విచారంగా అన్నాడామె మామ.

పిల్ల ఇల్లెగిరిపోయేటట్లు ఏడుపు మొదలెట్టింది. ఆకలికి ఓర్చుకుంటూనే ఆ పిల్లకు పాలు పట్టింది నాగమ్మ.

పాలు సరిగ్గా రాక పిల్ల వుండుండి ఏడుస్తూనే వుంది.

కన్నో, కాలో వంకరతో పుడుతుందని అంతా ఆశపడ్డారు. కానీ తీరా చూస్తే ఆ పిల్ల ఏ వంకా లేకుండా పుట్టింది.

ఇప్పుడిలాంటి ఆరోగ్యంగా వున్న పిల్లని బజార్లో పడేసి అడుక్కొంటే డబ్బెవరు పడేస్తారు?

కాళ్ళులేని పిల్లో, చేతుల్లేని పిల్లో-కళ్ళు, చెవి, ముక్కు ఏదొకటి వికృత రూపంలో వున్న పిల్లయితే నాలుగు డబ్బులు రాల్తేనే ఆ పిల్లకు, తమకూ కూడా జరుగుబాటు వుంటుంది.

ఇప్పుడేం దారి? ఏం చేయడం? నాగమ్మ ఆలోచనలో పడింది. ఎటూ తేలడం లేదామెకి.

ఓ పక్క తన ఆకలి, మరోపక్క పిల్ల ఆకలి! ఎటూ తేలనీయడం లేదవి. ఏ ఆలోచనా తోచనీయడం లేదు.

* * *

బొంబాయి చేరుకుని వారం రోజులైంది.

నిరంజనం తన మనవణ్ని స్పెషలిస్ట్‌కి చూపించాడు.

ఆయన ఎన్నో ఖరీదయిన పరీక్షలు జరిపి - అంత తేలిగ్గా నయం కాదనీ, చాలా కాలం వైద్యం చేస్తే వుపయోగం వుండవచ్చనీ చెప్పాడు. తనకి వాళ్ళ వూరు వచ్చి చూడ్డం సాధ్యం కాదు కనక వాళ్ళనే కొంత కాలం బొంబాయిలో వుండిపొమ్మన్నాడు.

తనకి కూడా సాధ్యం కాని పక్షంలో అప్పుడు అమెరికాకి వెళ్ళ వచ్చని సలహానిచ్చాడు. దాంతో ఆ కుటుంబం మకాంని తాత్కాలికంగా బొంబాయికి మార్చేసింది. భగవంతుడిమీదా, అ డాక్టరుమీదా భారం వేసి వేలకివేలు డబ్బు ఖర్చుచేయసాగారు.

భగవంతుడికి మొక్కులూ, పూజలూ-

డాక్టరుకి ఫీజులూ, పార్టీలూ—

* * *

రాన్రాను నాగమ్మకి ఆ పిల్లతో ప్రాణంమీద కొస్తోంది.

ఇంటిల్లపాదీ అడుక్కొచ్చినా చాలటం లేదు. ఆ పిల్లను చూస్తుంటే నాగమ్మకి కోపం ముంచుకొస్తోంది!

తనేం పాపం చేసిందని దేవుడు తన కిలాంటి అరోగ్యకరమైన బిడ్డ నిచ్చాడు. తనకన్న రెండునెల్లు ముందు కన్న సన్యాసమ్మకి ఇద్దరు గుడ్డి పిల్లలు? అంతకుముందు రామిగాడి పెళ్ళాం రంగికి తల పెద్దది, శరీరం చిన్నదిగా వున్న పిల్లాడు పుట్టాడు...

ఇలా అందరికీ అదృష్టం కలిసొచ్చింది. ఆ పిల్లలను పడుకోబెట్టి ఆడుకొంటుంటే వాళ్ళ జోలెలన్నీ నిండిపోతున్నయ్! తన ఖర్మే ఇలా కాలిపోయింది. ఆకలికి తాళలేక గుక్కపట్టి ఏడుస్తున్న పిల్లని లాగి కొట్టింది నాగమ్మ. పిల్ల ఆ దెబ్బకి ఓర్చుకోలేక తల్లడిల్లిపోసాగింది.

* * *

చాలారోజుల తర్వాత ఆ స్పెషలిస్ట్ వైద్యం కొంతవరకూ పని చేయడం ప్రారంభించింది. శ్రీలక్ష్మి పిల్లాడు కాళ్ళూ చేతుల్ని ఇప్పుడు కొంచెంగా కదపగలుగుతున్నాడు. ఆ రోజు పెద్ద పండుగ జరిపేశారు వాళ్ళు. ఆ డాక్టరుకు ఖరీదయిన వాచీ బహూకరించారు.

"పూర్తిగా స్వస్థత చేకూరాలంటే అతి ఖరీదయిన ఓ ఆపరేషన్‌ని చేయాల్సి వుంటుంది" అన్నాడు డాక్టర్.

"ఎంత డబ్బయినా ఖర్చు చేస్తాం. మాక్కావలసింది మా మనవడు అందరిలాగా తిరగడం...వాడు మిగతా అందరి పిల్లల్తో ఆడుకోవాలి. అంతే!" ఆవేదనతో అన్నారు నిరంజనంగారు.

*　　　*　　　*

ఆ వారం రోజులుగా ఇంటిల్లపాదీ ఆ పిల్ల గురించే ఆలోచిస్తున్నారు.

రాత్రనాను ఆ పిల్లను భరించడం కష్టమైపోతోంది వాళ్ళకి.

"ఏంసేద్దామే...?" నాగమ్మ భర్త దిగులుగా అడిగాడు.

"నువ్వే సెప్పు..." తోచక విసుగ్గా అన్నది నాగమ్మ.

"పోనీ, ఏడయినా ఇడిసేద్దామా...?" అడిగాడతను.

"నీ ఇట్టం. ఇడిసేద్దామంటే ఇడిసేద్దాం." కొంత అయిష్టంగానే అందామె.

లోపల తను కన్న మొదటి సంతానాన్ని అలా పారేయడం ఆమెకు ఇష్టంలేదు.

"రేపు పొద్దుగుంకింతర్వాత తట్టుకెల్లి ఏ రోడ్డు ప్రక్కనో ఇడిసేద్దాం. ఎవరో ఒకల్లట్టుకెల్లి పెంచుకుంటారు..." నిర్ణయించుకున్నట్లుగా అన్నాడతను.

"సరే..." వప్పుకుంది నాగమ్మ కన్నీళ్ళద్దుకుంటూ.

ఆ రాత్రి వాళ్ళ నిర్ణయాన్ని అత్తమామలు విన్నారు.

"ఆ పిల్ల కొద్దిగా పెద్దదయితే మనకి శానా వుపయోగపడుద్దిరా! అదే అడుక్కొంటది. అలా ఇడిసేత్తానంటే ఎలా?" అన్నాడు మామ.

"అవును. ఇంత కట్టపడీ కని, ఆ పిల్లనట్టా ఇడిసేత్తే ఎట్టా?" తనూ అతన్ని సమర్థిస్తూ అంది అత్త.

"మరంతవరకూ దీన్నెలాగే సూట్టం?" చిరాగ్గా అన్నాడు నాగమ్మ భర్త.

అందరూ మళ్ళీ ఆలోచనలో పడ్డారు.

"నేనో మాట సెప్తా ఇంటావా?" అడిగాడు మామ.

"సెప్పు..."

"ఈ పిల్లకి కాళ్ళూ, సేతులూ ఇరిసేద్దాం. మరే గొడవా వుండదు. రోడ్డు పక్కన పారేసి వుంచితే మనందర్నీ కూడా అదే పోసిత్తుంది..."

అందరూ నిశ్శబ్దంగా వుండిపోయారు.

కన్నపిల్లను పారేసుకోవడం కన్నా అదే మంచిదనిపించింది నాగమ్మకి.

అందరికీ ఆ పద్ధతే బాగనిపించింది.

అందరూ ముసలాడిని అంత మంచి ఉపాయం ఆలోచించినందుకు పొగిడారు.

* * *

ఆ రాత్రి—

బొంబాయిలో శ్రీలక్ష్మి పాపాయికి కాళ్ళూ చేతులూ మామూలుగా వచ్చేందుకు ఆపరేషన్ థియేటర్లో అనేకమంది డాక్టర్లు శ్రమపడుతూంటే...

నాగమ్మ పాకలోంచి కాళ్ళూచేతులు మెలితిప్పబడ్డ శిశువు పాక ఎగిరిపోయేటట్లు ఏడ్వడం మొదలుపెట్టింది...

(యువ-ఫిబ్రవరి 198(

# ఇది ఒక్కరాత్రి కథకాదు

"ఇవాళ్ళ 'జీరో-టు' తగిలి తీరుతుంది." మనలో తనే మరోసారి గొణుక్కున్నాడు శివరావు.

అందుకోసమే ఆ నెంబరు మీద కనీసం రెండు రూపాయలన్నా కట్టాలని ముఖ పరిచయమున్న ప్రతివాణ్ని అప్పు అడిగాడు. కాని ఫలితం శూన్యం.

తాకట్టు పెట్టదగ్గ వస్తువు కూడా ఇంట్లో ఏమీ లేదు.

ఏం చెయ్యాలో శివరావుకి పాలుపోవడంలేదు. టయిమ్ గడుస్తున్న కొద్దీ అతన్లో ఆతృత అధికమౌతోంది. మనసు విపరీతంగా పనిచేస్తోంది.

వున్నట్టుండి శివరావు మెదడులో ఓ మెరుపు మెరిసింది. ఆ మెరుపు కాంతిలో తండ్రి ముడుపు కట్టుకున్న అయిదు రూపాయల కాగితం కన్పించింది.

బహుశా చెల్లెలు మంచి నీళ్ళు తేవడాన్కి చెరువుకి వెళ్ళి వుంటుంది. అన్నయ్యా, నాన్నా ఎట్లాగో వూళ్ళో లేరు. ఇదే మంచి సమయం. శివరావు కాళ్ళు యింటికేసి కదిలాయి.

శివరావు ఇంటికి జేరుకునే సరికి అతను అనుకున్నట్లు ఇంట్లో ఎవ్వరూ లేరు. బయట గొళ్ళెం పెట్టుంది.

ఆ చుట్టుపక్కల వాళ్ళంతా అక్కడికి రెండు ఫర్లాంగుల దూరంలో వున్న చెరువు నుంచి మంచి నీళ్ళు తెచ్చుకుంటుంటారు. శివరావు చెల్లెలు రమ మళ్ళీ వెంటనే తిరిగొస్తాను కదా అనే వుద్దేశంతో మంచినీళ్ళకి వెళ్ళేప్పుడు బయట గొళ్ళెంపెట్టి వెళ్తూంటుంది.

"చెల్లాయి వచ్చేలోపలే పని పూర్తి చేసుకు వెళ్ళిపోవాలి" అనుకుంటూ తలుపు తెరిచాడు శివరావు.

సరాసరి కావడిపెట్టి దగ్గరికి వెళ్ళాడు. గబ గబా దాంట్లో వున్న గుడ్డలన్నిటినీ తీసి పక్కనపడ వేయసాగాడు. అడుగునవున్న పసుపు గుడ్డ మూటని చూడగానే అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి. దాన్ని పక్కనుంచి గుడ్డలన్నిటినీ తిరిగి పెట్టెలో సర్దేశాడు.

కూతురు పెళ్ళి జరిగితే కొండ కొస్తానని వెంకటేశ్వరస్వామికి మొక్కుకుని, అయిదు రూపాయల కాగితాన్ని ముడుపుకట్టి పెట్టుకున్నాడు శివరావు తండ్రి నిరంజనం.

పెట్టె మూత మూసి ఆత్రంగా పసుపుగుడ్డ విప్పాడు శివరావు అక్కడక్కడా పసుపయి, బాగా నలిగిపోయిన అయిదు రూపాయల కాగితం బయట పడ్డది. దాన్ని చూడగానే శివరావు కంటిముందు తండ్రి మెదిలాడు. 'ఈ ఐదురూపాయలు పోయినట్లు ఆయనకి తెలిసిందంటే గుండె ఆగిపోయినా ఆగిపోతుంది. రేపొద్దునే ఆ డబ్బు తీసుకొచ్చి యథాస్థానంలో పెట్టేయాలి' అనుకున్నాడు శివరావు.

ఆ అయిదు రూపాయల్ని తీసుకెళ్ళి వెంకటేశ్వరస్వామి పటం ముందుపెట్టి, చేతులు జోడించాడు.

"స్వామీ! ఇవాళ తప్పకుండా 'జీరో-టు' తగిలేటట్లు చూడు. కాయటానికి మీ డబ్బే తీస్కెళ్తున్నందుకు నన్ను క్షమించు. అంతకన్నా వేరే గత్యంతరం కన్పించలేదు. దాన్ను తగిలిందంటే అయిదు రూపాయలకి బదులు ఇరవై రూపాయలు ముడుపు కడ్తాను. అంతా మీ దయ!"

గబ గబా బయటికొచ్చి గొళ్ళెం పెట్టాడు. అతని కళ్ళు భయంగా ఒకసారి పరిసరాల్ని పరికించాయి. ఎక్కడా రమ వస్తున్న జాడ లేదు.

ఒకసారి తృప్తిగా గాలి పీల్చి బయల్దేరాడు. అతని కళ్ళముందు అయిదు రూపాయల కాగితం అరవై నాల్గు రూపాల్లో తాండవిస్తు కన్పించసాగింది.

## 2

సత్యమూర్తి స్థిర నిశ్చయాని కొచ్చాడు.

అది చాలా దృఢమైంది.

దాని కిక తిరుగులేదు.

ఆ నిశ్చయానికి రాగానే అతని మనస్సు కొద్దిగా తేలిక పడినట్లు అన్పించింది.

అతని చూపులు స్థిరంగా రైలు పట్టాల వెంటే పరుగెత్త సాగాయి. కాళ్ళు స్లీపర్‌ని విడిచి స్లీపర్‌ని తాకుతున్నాయి.

మానవుడాశాజీవి. అందుకు నిదర్శనం సత్యమూర్తి. ఆ ఆశవల్లే ఇంతకాలం బతికాడు. ఆ ఆశ తనకి ఎండమావి లాంటిదని తెలుసు కున్నాడు. తాను వుద్యోగాన్ని సంపాదించుకోగలననే కొద్దో గొప్పో వున్న ఆశ కూడా ఇవాళ్టి ఇంటర్వ్యూతో పూర్తిగా ఆవిరయింది.

అందుకే ఈ నిశ్చయానికొచ్చాడు.

సత్యమూర్తి జాలిగా ఒకసారి తన శరీరంవేపు చూసుకున్నాడు. ఇంకాసేపట్లో ఈ అవయవాలు ఎక్కడెక్కడ ఏయే రూపాల్లో వుంటాయో! ఈ ఆలోచన కలగ్గానే అతని కళ్లు చెమ్మగిల్లాయి.

'తను తిన్నా తినకపోయినా కూడా లెక్క చేయకుండా ఈ శరీ రాన్ని ఎంతో మమకారంతో పెంచారు నాన్నగారు. కాని తను- మరికొద్ది నిముషాల్లో దాన్ని నిర్దాక్షిణ్యంగా రైలుకింద నలిపేయడానికి నిశ్చయించు కున్నాడు!' విరక్తిగా నవ్వుకున్నాడు తన్లో తానే.

అతని చూపులు స్థిరంగా రైలు పట్టాల వెంట పరుగెత్తుతున్నాయి-పాదాలు స్లీపర్‌ని విడిచి స్లీపర్‌ని తాకుతున్నాయి.

'తను పెద్దకొడుకై నాన్నగార్ని ఏ మాత్రం సుఖపెట్ట గలిగాడు-మరిన్ని కష్టాల్లో ముంచడం తప్ప? మరో మూడు నెలల్లో ఆయన తన ఎలిమెంటరీ స్కూల్ మాష్టర్ గిరికి రిటైర్‌మెంట్‌వల్ల స్వస్తి చెప్పబోతు న్నారు. తను రిటైర్ అయేనాటికి చేతికంది వస్తాననే ఆశతో వున్న ఆ రెకరం పొలం అమ్మి గ్రాడ్యుయేటుని చేశారు. డిగ్రీ పుచ్చుకొని నాలుగేళ్ళు దాటుతున్నా ఇంతవరకు ఏ వుద్యోగాన్ని సంపాదించుకోలేకపోయాను. నాన్నగార్కి సహాయపడలేకపోగా ఇంకా భారంగా వుండలేను." సత్య మూర్తి మనసు బాధతో మూల్గింది.

వుద్యోగం రాకపోవడంలో పాపం సత్యమూర్తి తప్పేమీలేదు. పడిన ప్రతి వుద్యోగాన్కి దరఖాస్తులు పెట్టాడు. పిల్చిన ప్రతి ఇంటర్వ్యూకీ అప్పోసప్పోచేసి వెళ్ళాడు. అంతమాత్రానికే ఉద్యోగం వరిస్తుందా? నీ దగ్గర డబ్బుందా? రికమండేషనుందా? నిన్ను వరించడానికి- పొమ్మంది.

నాలుగేళ్ళు ఓపిగ్గా ఉద్యోగాన్వేషణ చేశాడు కాని ఇవాల్టితో అతని ఓపిక సమూలంగా తుడిచిపెట్టుకు పోయింది. అందుకే మృత్యువుపై మమ కారాన్ని పెంచుకుని ఆమె కౌగిట్లో కరిగిపోదామని బయలుదేరాడు.

ఆలోచనల మధ్య అవుటర్ సిగ్నల్ చేరుకున్నాడు. అక్కడే నిల బడి ఓసారి చుట్టూ చూశాడు. రైలుకట్ట ప్రక్కనే అక్కడొకటి అక్క డొకటి కొన్ని గుడిసెలు, చిన్నచిన్న పెంకుటిళ్ళు వున్నాయి. ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. ఎవ్వరూ తనని ప్రత్యేకంగా గమనించడంలేదు. తిరిగి రైలు పట్టాల వెంట నెమ్మదిగా నడక సాగించాడు సత్యమూర్తి.

అతనికి మర్చిపోదామనుకుంటున్నకొద్దీ ఆ రోజు జరిగిన ఇంటర్వ్యూ తిరిగి తిరిగి గుర్తుకు రాసాగింది. కోపంతో శరీరం వుడికిపోసాగింది.

వున్న వేకెన్సీలు నాల్గు-ఇంటర్వ్యూకొచ్చిన అభ్యర్థులు నాల్గొందలు. ఆ నాల్గు వేకెన్సీలు కూడా ముందే కంపెనీ మానేజిమెంట్ తరఫు మనుషులకు రిజర్వ్ చేయబడ్డాయట. మరటువంటప్పుడు, తమలాంటి వాళ్ళని పిలిపించి బాధించడ మెందుకో అర్థం కాలేదు సత్యమూర్తికి. కోపాన్ని పట్టలేక ఆ మాటే అక్కడున్న ప్యూన్ని అడిగాడు.

"ఈ ఇంటర్వ్యూలు జరుపుతున్నది ఖాళీలు భర్తీ చేయడానిక్కాదు బాబూ! కంపెనీ ప్రెస్టేజ్‌కోసం. కాగితాలమీద జరపాల్సిన కర్మకాండ పూర్తిగా జరిపించడంకోసం. అదీగాకుండా అప్లికేషన్లతోపాటు కొంత పైకాన్ని వసూలుచేసుకోవడం కోసం." వేదాంతిలా నవ్వాడు.

సత్యమూర్తికి అరికాలిమంట నెత్తికెక్కింది. కోపంతో ముఖం ఎఱ్ఱబడింది. పళ్ళు పటపటా నూరాడు. మిషన్‌గన్ గనుక దొరికితే వరసపెట్టి అందర్నీ కాల్చేయ్యాలనిపించిందతనికి. కాని, ఏం చెయ్యగలడు? మారు మాటాడకుండా వెనుదిరిగాడు.

దూరంగా రైలుకూత వినిపించింది. కళ్ళు చికిలించుకుని చూశాడు. మసకచీకటిని చీల్చుకంటూ రైలు ముందుకు వస్తోంది.

"నన్ను క్షమించండి నాన్నగారూ! మీకు నా దౌర్భాగ్య ముఖాన్ని చూపలేను. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను." నెమ్మదిగా గొణుక్కున్నాడు.

"ఏం బాబూ! ఆత్మహత్య చేసుకోడానిక్కి బయలుదేరావా?" భుజం మీద చెయ్యి పడటంతో వులిక్కిపడ్డాడు సత్యమూర్తి. పక్కకి తిరిగాడు.

ఒక ముసలాయన నిలబడున్నాడు. ఆయనకి సుమారు యాభై సంవత్సరాలుంటాయి. చాలా సాధారణమైన దుస్తులు ధరించి వున్నాడు. కోపం తాలూకు చిహ్నాలు మొహంలో స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఆయన చూపులు తీక్షణంగా సత్యమూర్తి మొహాన్ని తాకుతున్నాయి,

ఆ చూపుల ధాటికి తట్టుకోలేక తలవంచుకున్నాడు సత్యమూర్తి.

రైలు కూత మరోసారి విన్పించింది.

"మేము తినీ తినకుండా మిమ్మల్ని కష్టపడి పెంచితే, మమ్మల్ని సుఖపెట్టకపోగా, మరిన్ని కష్టాల్లో ముంచి ఆత్మహత్య చేసుకుంటారా? ఇది మీకు న్యాయమేనా?" సత్యమూర్తికి ఆయనెప్పుడూ చూసిన గుర్తు కూడా లేదు. అతనికి ఆయన ప్రవర్తన, మాటలు కంగారు పుట్టిస్తున్నాయి.

"ఏమిటండీ మీరనేది? నన్నెవరనుకున్నారు?" తడబడ్డాడు.

"నాకు తెలీదనుకుంటున్నావా నువ్వెవరివో! ఉద్యోగం రాకపోతే ఏ మూటలు మోసయినా తల్లిదండ్రుల్ని బ్రతికించుకోవాలి. అంతేగాని ఆత్మహత్య చేసుకుంటావా?" తన మనసులోని విషయాన్ని ఆయనెట్లా పసిగట్టాడో అర్థం కావడంలేదు సత్యమూర్తికి.

"ఏమిటయ్యా! అట్లా గుడ్లు మిటకరించి చూస్తావ్? అదిగో బండి వచ్చేస్తోంది. ముందు రైలుకట్ట దిగు." పక్కకి తోశాడు. సత్యమూర్తి పడబోయి తమాయించుకుని నిలబడ్డాడు.

సత్యమూర్తికి అంతా అగమ్య గోచరంగా వుంది. తన్ని పక్కకి తోసిన ముసలాయన తీక్షణంగా వచ్చే బండిని చూస్తూ రైలుపట్టాలమధ్య నిలబడ్డాడు. బండి దూసుకు వచ్చేస్తోంది.

"ఏమండోయ్! బండి వచ్చేస్తోంది. పట్టాలమీంచి ఆ ముసలాయన్ని పక్కకి లాగండి." ఎవరో కుర్రాడు అరుచుకుంటూ పరుగెత్తుకొస్తున్నాడు. బండి బాగా దగ్గర కొచ్చేసింది.

సత్యమూర్తి ముసలాయన్ని పక్కకి లాగబోయాడు. ఆయన సత్యమూర్తిని విదిలించికొట్టాడు.

"ఆయనకు మతిస్థిమితం లేదు. బండి కింద పడతాడు. పక్కకి లాగండి." కుర్రాడు రొప్పుకుంటూ పనుగెత్తుకొస్తున్నాడు.

సత్యమూర్తి రెండు చేతులూ ముసలాయన నడుముకి వాటేసి, బలవంతాన పక్కకి లాగాడు.

బండి మరీ దగ్గర కొచ్చేసింది. సత్యమూర్తి ఆయన్ని మరింత గట్టిగా పట్టుకున్నాడు.

దడదడ శబ్దం చేసుకుంటూ బండి వాళ్ళ పక్కనుంచీ దూసుకు పోయింది.

ఆ కుర్రాడు వాళ్ళని చేరుకున్నాడు. చెమటతో అతని చొక్కా పూర్తిగా తడిసిపోయింది. ఉఛ్వాసనిశ్వాసాలతో అతని గుండె అదిరిపడు తోంది. కృతజ్ఞతగా సత్యమూర్తి వంక జూశాడు.

"చాలా థాంక్స్ అండీ! మీకు శ్రమ ఇస్తున్నందుకు వేరేగా భావించకండి. అదుగో ఆ కనిపించే చిన్న పెంకుటిల్లే మాది. దయచేసి అంతవరకూ ఈయన్ని పట్టుకెళ్ళడానికి సహాకరించండి!" కుర్రాడు సత్యమూర్తిని అభ్యర్థించాడు.

"పదండి."

"వదలండిరా నన్ను. నా కొడుకుని పొట్టన బెట్టుకున్న ఆ రైలు అంతం చూస్తాను." ముసలాయన ముందుకు రానని మొరాయించ సాగాడు. ఇద్దరూ ఆయన చెరోపక్క పట్టుకొని బలవంతాన ఇంటికి జేర్చారు. ముసలాయన్ని ఒక గదిలో తోసి బయట గొళ్ళెం పెట్టాడు కుర్రాడు.

"నా పేరు రాజండి. ఆయన మా నాన్నగారు. మా నాన్నగారి ప్రాణాలు కాపాడినందుకు మీకెట్లా కృతజ్ఞతలు చెప్పాలో నా కర్థం కావటం

లేదు." కళ్ళలో కృతజ్ఞతాభావంతో సత్యమూర్తి చేతులు పట్టుకున్నాడు రాజు.

"మరి..." సత్యమూర్తికి ఎట్లా అడగాలో ఏమని అడగాలో అర్థం కాలేదు.

రాజే చెప్పుకుపోసాగాడు: "మా నాన్నగారు తాలూకా ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తుండేవారు. ఆయనకు నేను, అన్నయ్యా ఇద్దరం రెండు కళ్ళు. నాన్నగారి ఆశలన్నీ అన్నయ్యమీదనే వుండేవి. చదవడమైతే వాడివల్ల అయిందిగాని ఉద్యోగం సంపాదించుకోవడం వాడివల్ల కాలేదు. ఇరవై అయిదేళ్ళు దాటినా తండ్రి సంపాదన తింటూ కూర్చోవడం వాడికి బాధగా వుండేది.

తన ఆత్మహత్యకి ఎవరూ కారణం కాదని, వుద్యోగం లేకపోవడంతో విసిగి ఆత్మహత్య చేసుకొంటున్నానని వుత్తరంరాసి; సరిగ్గా ఇందాక మీరు నాన్నగార్ని రక్షించిన చోటే, అదే రైలు కిందపడి ఆత్మహత్య చేసుకున్నాడు.

అమ్మకి అసలే గుండెనొప్పి. ఈ విషయం తెలియగానే పడిపోయింది. కొడుకు చచ్చిపోయాడన్న వార్త విన్న ఇరవై నాలుగు గంటల్లోపలే ఆవిడా కొడుకును వెదుక్కుంటూ ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయింది. నాన్నగారి మనసు ఒకేసారి ఈ రెండు షాక్‌లకే తట్టుకోలేకపోయింది. అప్పట్నుంచీ మతిస్థిమితం తప్పింది. బండికూత వినిపిస్తే చాలు పట్టాలవేపు పరుగెత్తుతారు. అందుకనే ఆయన్ని ఆ గదిలో పెట్టి తలుపు గడియ పెడ్తుంటాను. కాని ఇందాక భోజనం పెట్టి పళ్ళెం పుచ్చుకుని బయటికొచ్చేప్పుడు, గొళ్ళెం పెట్టడం మర్చిపోయాను. కంచం కడిగి వచ్చేసరికి ఆయన గదిలోలేరు. రైలు కూత విన్పించింది. వెంటనే పరుగెత్తుకొచ్చాను. ఆ తరువాత సంగతి మీకు తెలిసిందే." రాజు కళ్ళవెంట అశ్రువులు ధారగా కారసాగాయి.

"ఈ రైలు పట్టాలకి దూరంగా పోతేగాని, ఆయనకి కొద్దిగానైనా మన స్థిమితం చిక్కదని తెలుసు. కాని ఏం చేయను? ఈ ఇల్లు అమ్మేస్తే, వచ్చిన డబ్బు కాస్తా నెలరోజుల్లోనే అయిపోతుంది. ఆ తర్వాత అద్దె కొంపల్ని ఎన్నాళ్ళని భరించగలను? నాన్నగార్ని జాగ్రత్తగా కాపాడుకోవాలంటే కనీసం రెండు గదులున్న ఇల్లయినా కావాలి."

సత్యమూర్తి కళ్ళముందు తండ్రికి పిచ్చెక్కి పరుగెత్తుతున్నట్లు కన్పించసాగింది. ఒక్కసారి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. మెదడ్లో రంగులు మారాయి. నిశ్చయం మారింది.

"నాకు కనువిప్పు కల్గించినందుకు చాలా థాంక్స్ అండీ! బండి బయల్దేరే టైం అయింది, వస్తా." గబగబా ఇంట్లోంచి బయటికొచ్చాడు.

రాజుకి సత్యమూర్తి ప్రవర్తన వింతగా తోచింది.

"మాష్టారూ! ఒకనిముషం ఆగండి - కాఫీ కలిపి తెస్తా."

"బండి టయిమయింది. ఈసారి మళ్ళీ ఇక్కడికొచ్చినప్పుడు వస్తా." పరుగులాంటి నడకతో స్టేషన్ కేసి నడవసాగాడు సత్యమూర్తి.

అతని ప్రవర్తన అర్థంగాక రాజు అచేతనంగా చూస్తూ నిలబడిపోయాడు.

## 3

"రమా! నువ్విక్కడే కూర్చో టికెట్లు తీసుకొస్తాను" రమని వెయిటింగ్ రూమ్‌లో కూర్చోమని టికెట్లు తీసుకురావడానికి బుకింగ్‌వేపు బయల్దేరాడు ప్రసాద్.

రమ కాలక్షేపం కోసం చేతిలోనున్న వీక్లీని తెరిచింది.

తను ప్రేమించిన వాడికోసం తోబుట్టువుల్నీ, తల్లిదండ్రుల్నీ విడిచి వెళ్ళిపోయిన సావిత్రి అప్పుడు పరంధామయ్యగారి గురించి ఆలోచిస్తోందో

లేదోగాని, పరంధామయ్యగారు మాత్రం సావిత్రినే తలచుకొని కుమిలి పోసాగారు.

మర్చిపోదామనుకుంటున్నకొద్దీ వూళ్ళోవాళ్ళ ములుకుల్లాంటి మాటలు మరిన్నిసార్లు గుర్తుకొచ్చి ఆయన మనసుని విపరీతంగా బాధించ సాగాయి.

అర్ధరాత్రి దాటుతున్నా కంటి మీదకి చిన్నకునుకుక్కూడా రావడం లేదు.

చివరికో నిశ్చయాని కొచ్చారు.

నెమ్మదిగా మంచం మీదనుంచి లేచి బావి వేపు బయలుదేరారు. మరో అయిదు నిముషాల తరువాత ఆయన శవం బావిలో నీళ్ళపై.

ఇక చదవలేకపోయింది రమ. పుస్తకాన్ని పక్కకి విసిరేసింది. ఆమె కళ్ళవెంట అశ్రువులు ధారగా కారసాగాయి.

'వూళ్ళో వాళ్ళంతా లేచిపోయిందాని తండ్రని, తండ్రిని నానామాట ంటున్నట్లు, ఆ మాటలు భరించలేక తండ్రి ఆత్మహత్య చేసుకున్నట్లు...' ిపరీతమైన అలోచన్లు కలగసాగాయి.

'ఆర్థిక పరిస్థితి కారణాన ఇరవై సంవత్సరాలు దాటినా తండ్రి తనకి పెళ్ళి చెయ్యలేకపోయాడు. దానికి ఆయన కుమిలిపోని క్షణం లేదు. కాని తనేం చేస్తున్నది? ప్రేమించిన వ్యక్తి కోసం అష్టకష్టాలూ పడి పెంచిన తండ్రినీ, తోబుట్టువులనీ విడిచి వెళ్ళిపోతోంది. తన సుఖం గురించి ఆలోచించిందేగాని, తండ్రి పడబోయే మానసిక చిత్రహింస గురించి ఒక్కసారి కూడా ఆలోచించలేదు. 'నా జీవితం నాశనమైపోయినా సరే, నావల్ల నాన్నకి బాధ కలగకూడదు.' రమ లేచి నుంచుంది. తన సంచీని తీసుకొని బయటకొచ్చింది.

వాకిలి దగ్గరకి ప్రసాద్ ఎదురొచ్చాడు.

"నన్ను క్షమించు ప్రసాద్! నా ఒక్కదాని సుఖంకోసం తండ్రినీ, తోబుట్టువుల్నీ బాధించలేను." ఆమె కళ్ళు వర్షించాయి.

ప్రసాద్‌కి అంతా అయోమయంగా వుంది. ఆమె ప్రవర్తన వింతగా వుంది.

"రమా! ఎక్కడికి వెళ్తున్నావ్?" వెళ్తున్న రమని ఎదురెళ్ళి నిలబెట్టాడు.

"ప్రసాద్! నన్ను మర్చిపో. నేను బలహీనురాల్ని, నీతో రాలేను" గబగబా ముందుకెళ్ళిపోయింది.

ప్రసాద్ నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

* * *

రాత్రి పన్నెండు గంటలు దాటింది.

అమావాస్య కావడంతో, చీకటి నిరుద్యోగంకన్నా దట్టంగా వ్యాపించింది. అధికార, ధన వ్యామోహాలు తప్ప ప్రజల బాగోగులు పట్టని నాయకుడిలా రైలు తన గమ్యాన్ని చేరుకోడానికి ముందుకు పరుగెడుతోంది.

ఆ కంపార్టుమెంట్‌లో అంతా నిద్రపోతున్నారు. కాని నిరంజనం మాష్టారికి మాత్రం నిద్ర రావడంలేదు. మరో రెండు నెల్లో రిటైర్ కాబోతున్నారు. ఆ తరువాత కుటుంబ పరిస్థితుల గురించి వూహిస్తుంటే ఆయనకి మతిపోతోంది.

వీటన్నిటికన్నా కుమార్తె పెళ్ళివిషయం పెద్ద సమస్యగా నిల్చింది. ఈ సంబంధమన్నా నిశ్చయం కాబోతుందా అనే కొండంత ఆశతో వచ్చారు.

పిల్ల నచ్చిందన్నారు.

సంప్రదాయం బాగుందన్నారు.

అన్నిటికీ సంతృప్తుల మయ్యాం అన్నారు.

కానీ, కట్నం కనీసం రెండువేలన్నా కావాలన్నారు.

తన జీతంతో కుటుంబం గడపటమే అంతంత మాత్రం. అటు వంటప్పుడు రెండువేలు ఎక్కడ్నించి తేగల్రు? అందుకే ఆ సంబంధం మీద ఆశ వదలుకుని తిరుగు ప్రయాణం కట్టారు.

'రమకి నెలరోజుల్లో ఇరవై సంవత్సరాలు నిండుతాయి. అణుకువ గల పిల్ల కాబట్టి ఇంతవరకూ ఎటువంటి అఘాయిత్యమూ చెయ్యలేదు. కాని బుసలుకొట్టే యవ్వనాన్ని ఎన్నాళ్ళెదుర్కోగల్దు? అసమర్థుడికి అన్నీ సమస్యలే! ఆడపిల్లకి పెళ్ళి చెయ్యలేను. పెద్దకొడుక్కి ఉద్యోగం యిప్పించుకోలేను. చిన్న కొడుకుని బాగుచేయలేను. ఛీ...ఛీ...ఇటువంటి నిర్భాగ్యపు బ్రతుకు బ్రతుకేకన్నా రైల్లోంచి కిందికి దూకి చావడం మేలు. చివరికి చావే తన సమస్య లన్నిటికీ పరిష్కార మార్గ'మని నిశ్చయించు కుని లేచి నిలబడ్డారు నిరంజనంగారు.

ఒళ్ళో పెట్టుకున్న సంచీ కిందపడింది. వంగి దాన్నందుకో బోయారు. దాంట్లోంచి కూతురు ఫొటో కిందపడింది. రమ ఫొటోని చూడగానే తిరిగి ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆ ఫొటోని చేతిలోకి తీసుకున్నారు. ఆయన మనసెంతో గందరగోళంగా వుంది.

"పెద్ద కొడుకు కొద్దో గొప్పో చదువుకున్నాడు. ఏదో విధంగా ఇవాళ కాకపోయినా రేపయినా వాడి బతుకు వాడు చూసుకోగలడు. చిన్న వాడు జులాయివెధవ కాబట్టి దేశం మీదైనా పడి బతగలడు. కాని రమ? ఒకవేళ తను చచ్చిపోతే రమ భవిష్యత్తు? అసలే అమాయకపు పిల్ల. మాయ మాటల్తో ఎవరో ఒకళ్ళు వంచిస్తారు. లొంగకపోతే బలవంతాన్నైనా పతనం చేస్తారు. నేను, చావను. కనీసం రమ కొక భవిష్యత్తు చూపించేవరకైనా

నేను చావను.' రమ ఫోటోని గుండెలకు హత్తుకుంటూ తిరిగి బెంచిమీద కూలబడ్డారు నిరంజనంగారు.

*   *   *

చీకట్ని కొద్దికొద్దిగా మింగుతూ వెలుగు వస్తోంది. నిద్రలేమితో శివ రావుకి కళ్ళు ఎర్రబడ్డాయి. కడుపులోకి రాత్రంతా ఏమీ పడకపోవడంతో పేగులు అరుస్తున్నై. అయినా శివరావుకి ఇంటికి వెళ్ళాలనిపించడంలేదు.

"లెక్క ఎక్కడో తప్పుంటుంది. అందుకే" జీరో-టు రావల్సింది, జీరో-సెవెన్ వచ్చింది. ఛీ...ఛీ..." గొణుకున్నాడు శివరావు.

అతని మనసంతా చిందరవందరగా వుంది. ఇంటికి వెళ్ళటానికి బుద్ధి పుట్టడంలేదు. అక్కడే కూర్చోడానికి బుద్ధి పుట్టడంలేదు. దాదాపు రెండు గంటలనుంచి అతని మనసు పెండ్యులమ్‌లా కొట్టుకుంటోంది.

''బెజవాడ వెళ్ళిపోతే......'' ఈ ఆలోచన రాగానే శివరావుకి సత్యమూర్తి గుర్తుకొచ్చాడు. "చదువుకున్న వాళ్ళకే వుద్యోగాలు లేకపోతే నాకెవడిస్తాడు? అన్నయ్య రాత్రి వచ్చుంటాడు బెజవాడ్నించి. ఏమైందో ఈసారి ఇంటర్వ్యూ? ఏమవుతుంది! మామూలే! ఇరవై రూపాయలూ తగ లేసి తిరిగొచ్చుంటాడు!" అతని మనసులో ఏదో కొత్తభావం తళుక్కు మంది.

"అన్నయ్య వుద్యోగాన్వేషణలో తిరుగుతూంటే ప్రతి ఇంటర్వ్యూకు నాన్న డబ్బులిచ్చి పంపడం లేదూ? అట్లాగే అయిదు రూపాయలు నేను వాడుకున్నాను. ఇదీ ఇంటర్వ్యూలాంటిదే. ఇంటర్వ్యూకెళ్ళిన ప్రతి ఉద్యో గమూ వస్తుదా? అట్లాగే కట్టిన ప్రతిసారీ రాకపోవచ్చు. నా తాపత్రయం మాత్రం కుటుంబం కోసంకాదూ? అటువంటప్పుడు నేనెందుకు భయ పడాలి? నాన్న ఏమైనా అంటే ఊరుకుంటానా?" అనుకున్నాడు. ఈ నిశ్చ యానికి రాగానే ఇంటికి బయలుదేరాడు.

శివరావు ఇంటికి జేరేసరికి రమ వాకిలి వూడుస్తోంది.

ఆమెని చూడగానే, 'ఛీ, నాలాంటి పుటక పుట్టేకన్నా ఆడపిల్లగా పుట్టినా బాగుండు. తీసుకొచ్చిందేదో వండిపడేస్తుంటారు. సంపాదించాలనే బాధ వాళ్ళకుండదు.' అనుకున్నాడు.

అతని కళ్ళు భయంగా తండ్రికోసం వెదికాయి. నిరంజనంగారు బావిపళ్ళెంలో కూర్చుని పళ్ళు తోముకుంటున్నారు. నిశ్చలంగా పళ్ళు తోముకుంటున్న ఆయన్ని చూడగానే శివరావుకి వళ్ళు మండింది.

"నిశ్చింతగా యెట్లా పళ్ళు తోముకుంటున్నాడో చూడు! ఇరవై సంవత్సరాలు దాటినా కూతురికి పెళ్ళిచేయాలనే ధ్యాసేలేదు. మరో రెండు నెలల్లో శుభ్రంగా రిటైర్ అయి కూర్చుంటాడు. నా జీవితాన్ని సర్వ నాశనం చేశాడు. వున్న పొలం కాస్తా అమ్మి అన్నయ్యని చదివించాడు. నన్ను మాత్రం చదివించలేనని కాళ్ళు బారజాపాడు. నేనేమీ అన్నయ్య లాంటి అసమర్థుడ్నిగాను. చదివించి వుంటే శుభ్రంగా ఈపాటికి ఏదో వో వుద్యోగాన్ని సంపాదించుకునేవాడ్ని. నన్ను నాశనం చేశాడు." శివరావు వాళ్ళిద్దర్లో ఎవర్నీ పల్కరించాలని ప్రయత్నించలేదు. కోపంతో శివరావు ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఇంట్లో, చాపమీద పడుకున్న సత్యమూర్తిని చూడగానే శివరావు కోపం తారాస్థాయికి జేరుకుంది.

'చదువు పేరుతో వున్న కాస్త పొలం మింగాడు. ప్రతి నెలా ఇంట ర్వ్యూల పేర్లతో వూళ్ళన్నీ చుట్టేసి వస్తున్నాడు. ఉద్యోగమూ లేదు, సద్యోగమూలేదు. రెండు నెలల్లో నాన్న రిటైర్ అయిపోతున్నాడనే విష యం తెలియదా? రమ పెళ్ళి కెదిగి గుండెల మీద కుంపటిలా వుందని తెలియదా? ఛీ... ఛీ... ఏ విషయమూ పట్టించుకోకుండా తిరగటానికి సిగ్గులేదూ వెధవ జన్మ!' శివరావుకి సత్యమూర్తి కాళ్ళు పుచ్చుకుని బర బరా బయటికి లాగాలనిపించింది. కాని బలవంతాన తమాయించుకున్నాడు.

'ఈ ఇంట్లో వున్న వాళ్ళంతా బాధ్యతలేని మనుషులు. కుటుంబ పరిస్థితుల గురించి ఎవ్వరూ ఆలోచించరు. వీళ్ళెవ్వరికీ లేని బాధ నాకెందుకు?' తనూ ఒక చాప పర్చుకుని, దానిమీద ముసుగు తన్ని పడు కున్నాడు శివరావు.

* * *

ఇది ఒక్కరాత్రిలో జరిగిన కథేగాని, ఒక్క రాత్రికే సంబంధించిన కథ మాత్రం కాదు. కొద్దో గొప్పో మార్పులతో నిరంజనం మాష్టారి కుటుంబం ఇటువంటి రాత్రుల నింతకు ముందెన్నో చూసింది, ఇకముందు చూడబోతోంది కూడా. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ వాళ్ళ జీవితాలలో మార్పనేది వుండదేమో! *

(స్వాతి మాస పత్రిక-మార్చి 1975)

# ఇష్టం

"ఇవాళయినా ఆ గుడ్డల్ని టైలర్‌కి ఇస్తారా లేదా?" ఆఫీసుకి బయల్దేరబోతూంటే భవాని అడిగిన ఆ ప్రశ్నకి వళ్ళు మండిపోయింది.

తను భార్య, నేను భర్త. నా ఆజ్ఞను తను పాటించాలా! తనాజ్ఞను నేను పాటించాలా?

అసలు నాకు చెప్పకుండా నాకు గుడ్డలు తేవడం తన మొదటి తప్పు. ఒకవేళ తెచ్చిందే అనుకో. అవి నాకిష్టం లేని రంగువని తెలిసి కూడా అవే కుట్టించమని నన్ను వేధించడం రెండో తప్పు. అంతకన్నా భయంకరమైన మూడో తప్పు నేనూరుకుంటున్నాను కదా అని ఆ వేధింపుల్ని సాధింపుల్లోకి, ఆజ్ఞల్లోకి దించడం...!

ఇంకా క్షమించుకుంటూ పోతే మరింకెన్ని తప్పుల్ని కాయాల్సి వస్తుందో! ఇంక వుపేక్షించకూడదు. గట్టి డోస్ ఇవ్వాలి.

"మిమ్మల్నే! ఇవాళ గనక మీరా గుడ్డల్ని టైలర్ కిచ్చి రాక పోయారో రాత్రినించీ నే నన్నం ముట్టుకోను. ఇక మీ ఇష్టం!" ఖచ్చితంగా ఆమె అలా అనేసరికి నాకు వళ్ళు మండిపోయింది.

"నేనూ ఖచ్చితంగానే చెప్తున్నాను. ఆ గుడ్డల్ని నేను కుట్టించు కోను. ఎట్లాగూ కొనేశావు కాబట్టి, వాటిని ఈసారి మీ తమ్ము డిక్కడికి వచ్చినప్పు డతనికిచ్చేయ్!" గబగబా బయటి కొచ్చేసాను.

ఎంత భార్యయితే మాత్రం అంత అజమాయిషీనా? నేను తొడుక్కునే గుడ్డలు కూడా తన కిష్టమయినవే అయివుండాలా? ఇక నామీద కూడా నాకు ఇష్టాయిష్టాలే వుండకూడదా?



సరిగా క్రిందటి సంవత్సరం ఈపాటికి తనెవరో, నేనెవరో! ఈ ఒక్క సంవత్సరంలోనే నామీద ఈమెకింత అధికారం వచ్చిందా! చిన్నప్పట్నించీ పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులే నాతో ఎప్పుడూ ఇట్లా మాట్లాడలేదు. నాకెప్పుడు గుడ్డలు కొనాల్సివచ్చినా నాన్నగారు నన్ను వెంటపెట్టుకునే వెళ్ళేవారు. నా కిష్టమయినవాటినే కొనేవారు. అట్లాంటిది నిన్నగాక మొన్న వచ్చిన ఈమె అధికారపూర్వకంగా ఆ గుడ్డల్ని

కుట్టించుకొమ్మని ఆజ్ఞాపిస్తే పాటిస్తానా? చచ్చినా పాటించను. ఏమయినా సరే, ఆ గుడ్డల్ని కుట్టించుకోను గాక కుట్టించుకోను...

నేను బస్టాప్‌కి చేరుకోవడం, బస్సు రావడం ఒకేసారి జరిగాయ్.

పద్మవ్యూహంలోకి జొరబడ్డట్టు జనాల్ని తోసుకుంటూ ఎక్కగానే బయల్దేరింది బస్సు.

రోజూ ఇదో నరకం!

ఆఫీసు సమయాల్లో బస్సులన్నీ రద్దీ. బస్‌స్టాప్‌లలో బస్సులాపడమే గగనం. ఒకవేళ ఆపినా బస్సెక్కడం కష్టం. కష్టాలన్నీ ఓర్చి బస్సెక్కితే జనం మధ్య ఇలా నలిగిపోవాలి.

తప్పదు! మధ్యతరగతి మనిషిగా పుట్టినందుకు ఇటువంటి నరకాల నన్నింటినీ భరించి తీరాల్సిందే!

దాదాపు ఓ అరగంట అలా నరకాన్ననుభవించింతర్వాత సికింద్రాబాద్ స్టేషన్ దగ్గర బస్సు దిగి ఆఫీసువేపు నడవసాగాను.

"రవీ!..." వెనకనించి ఎవరో పిల్చిన పిలుపుతో ఠక్కున ఆగిపోయాను.

బాగా పరిచయమయిన గొంతులాగే వుంది.

వెనక్కి తిరిగాను.

ఆశ్చర్యం!

ఆమె...ఆమె...

అవును, ఆమె రాజేశ్వరే! సందేహంలేదు.

మరి, ఇక్కడుందేమిటి?

హఠాత్తుగా ఆమె నక్కడ, అలా చూసేసరికి ఆశ్చర్యం, ఆశ్చర్యంతోపాటు కొద్దిగా కంగారు కలిగింది.

"ఏమిట్రవీ, అంతగా ఆలోచిస్తున్నావ్? నన్ను గుర్తుపట్టలేదా?"

నిన్ను గుర్తుపట్టలేనా రాజేశ్వరీ! నీలో ఎన్ని మార్పులొచ్చినా సరే, ఎన్ని వేలమంది మధ్యనున్నా సరే నిన్ను గుర్తుపట్టగల్ను! కాకపోతే హఠాత్తుగా దర్శన మిచ్చేసరికి కొద్దిగా కంగారు. అంతే!

"అబ్బే గుర్తించక కాదు...ఏవిటీ వున్నట్లుండి ఇలా హఠాత్తుగా దర్శనమిచ్చావ్?" అన్నాను నా కంగారుని కప్పిపుచ్చుకుని నవ్వేస్తూ.

"ఇక్కడ నిన్ను చూడగానే నేనూ ఆశ్చర్యపోయాను. కానీ నీలా అలా ఆశ్చర్యంలోనే మునిగిపోయి వూరుకోలేదు. వెంటనే తేరుకొని నిన్ను కేకేశాను." తనూ నవ్వింది.

ఆమె నవ్వుతూంటే ఎర్రని పెదాలమధ్య అందమయిన తెల్లని పలు వరుస తళుక్కున మెరిసింది.

అదే...ఆ అందమే, మొదట్నించీ ఆమె అంటే నేను పడిచచ్చేట్లు చేసేది. అలా ఆమె నవ్వుతుంటే అందం మరింత విజృంభిస్తుంది. వెంటనే ఆమెను దగ్గరకు లాక్కోవాలని...ఇంకా ఏమేమో చేయాలనీ మనసు వువ్విళ్ళూరుతుంది.

బలవంతాన నన్ను నేను నిగ్రహించుకోసాగాను.

"ఇన్నాళ్ళ తరువాత కనిపిస్తే రకరకా విషయాలన్నీ ఏకరువు పెట్టాల్సింది పోయి ఏవిటి అలా నిలువు గుడ్లేసుకుని చూస్తూ వుండి పోయావ్?" మళ్ళీ నవ్వింది.

వద్దు రాజేశ్వరీ! ప్లీజ్ నువ్వలా నవ్వకు! సభ్యత కూడా మరచి పోయి ఏం చేస్తానో అనే భయం నిలువునా నన్ను వొణికించేస్తోంది.

"అదిగో మా బస్సు వచ్చేస్తోంది. నువ్వివాళ సాయంత్రం తప్ప కుండా మా ఇంటికి వస్తున్నావ్. నీకోసం ఎదురుచూస్తుంటాను. "చటు

కృష్ణ నా చేతిలో వున్న పీక్లీ నందుకుని, దానిమీద తనింటి అడ్రసు రాసిచ్చింది.

ఇంతలో ఆమెక్కావలసిన బస్సు వచ్చి ఆగడంతో సాయంత్రం తప్పకుండా రమ్మని మరోసారి చెప్పి, బస్సువేపు నడిచింది.

ఆమెలో అప్పటికి ఇప్పటికి వయసు తెచ్చిన నిండుతనం తప్ప మరే మార్పూ కనిపించలేదు నాకు. అప్పుడెలా చొరవగా మాట్లాడేదో, ఇప్పుడూ అలాగే మాట్లాడుతోంది.

"సాయంత్రం తప్పకుండా వస్తున్నావ్ కదూ?" బస్సెక్కిం తర్వాత కిటికీలోంచి తల బయిటికి పెట్టి మళ్ళీ అడిగింది.

"తప్పకుండా వస్తాను," చిన్నగా నవ్వాను చెయ్యూపుతూ.

తనూ చెయ్యూపింది.

బస్సు బయలుదేరడంతో నెమ్మదిగా అక్కడ్నించి కదిలాను. శారీ రకంగా ఆమెకు దూరమవుతున్నా మానసికంగా ఆమెకు దూరం కాలేక పోతున్నాను. ఆమెలో వున్న ఆకర్షణకి నేనంతగా కట్టుబడిపోయాను. అసలామెతో పరిచయమే చాలా విచిత్రంగా జరిగింది.

రాజేశ్వరీ వాళ్ళ నాన్నగారికి కొత్తగా మా వూరు బదలీ అయి వచ్చారు. వాళ్ళిల్లు మా వీధిలోనే.

రోజూ వాళ్ళింటికి, మా యింటికి రాకపోకలుండేవి. ప్రతిరోజూ మా గులాబీ చెట్టుకు పూసే పువ్వు కోసుకుపోవడానికి వచ్చేది రాజేశ్వరి.

ఓ రోజు ఇంట్లో ఎవ్వరూ లేని సమయంలో వచ్చింది. నేనొక్కడ్నే వుండడం చూసి సిగ్గుపడిపోయింది.

వెనక్కి తిరిగి వెళ్ళిపోతూంటే నేనే కేకేశాను.

"ఏమండీ! వెళ్ళిపోతున్నారేం? మీ కోసం గులాబీ పువ్వుకోసి వుంచాను..." అంటూ లోపలికెళ్ళి పువ్వును తీసుకొచ్చి ఆమె కందించాను.

"చాలా థాంక్సండి..." అందామె నావంక చూస్తూ.

"మీరీ గులాబీపువ్వు పెట్టుంటే ఎంత బావుంటారో తెలుసాండీ! మిమ్మల్నిలా గంటల తరబడీ చూస్తూండాలనిపిస్తుంది..."

ఆమె కిలకిల నవ్వేసి వెళ్ళిపోయింది.

ఆ మర్నాడు ఆమె వచ్చేసరికి నేను గులాబీపువ్వు కోసి, వాకిట్లోనే ఆమె కోసం ఎదురుచూస్తూ నిల్చున్నాను.

ఆమె ఆశ్చర్యపోయింది.

"మీరిలా ఇవ్వడం ఎవరయినా చూస్తే..." అంది సంశయంగా.

"నాకు ఆనందం కల్గించే పనిచేయడానికి భయమెందుకూ?" అన్నాను ధైర్యంగా.

అక్కడ్నుంచి ఇద్దరం కలిసే కాలేజీకి బయలుదేరాం.

ఇద్దరిదీ ఒకే క్లాస్‌కూడా కావడంతో మా పరిచయం మరింత తొందరగా పెరిగిపోయింది.

అలా పెరిగిపోయిన పరిచయం, ఆ తర్వాత నెమ్మదిగా ప్రేమలోకి దిగిపోయింది.

ఆమెను చూడకుండా నేను, నన్ను చూడకుండా ఆమె వుండలేని స్థితిలోకి వచ్చేశాం. క్రమంగా కాలేజీలో కూడా మా గురించి గుసగుసలు ప్రారంభమయ్యాయ్. అయినా ఇద్దరం వాటిని లక్ష్యపెట్టలేదు. మరింత చనువుగా వుండసాగాం.

ఒకళ్ళకి తెలీని పాఠాలు మరొకళ్ళం చెప్పడం వంకతో వీలైనప్పుడల్లా ఒకళ్ళింటికి మరొకళ్ళం వెళ్ళడం ప్రారంభించాం...

ఆఫీసుకి చేరుకున్నాను. రాజేశ్వరి గురించిన తియ్యటి ఆలోచనల వల్ల నడచినట్లే అనిపించలేదు.

రిజిష్టర్‌లో సంతకంచేసి సీట్లో కూలబడ్డాను.

సీట్లో కూర్చున్న తరువాత కూడా మనసు పనిమీద లగ్నం కావడంలేదు. మనసునిండా రాజేశ్వరే!

ఆ రోజు కాలేజీకి వెళ్ళేప్పుడు—

"రవీ! నువ్వివాళ ఓ పనిచేయాలి" అంది దగ్గరకొచ్చి.

"ఏవిటీ?" అడిగాను.

"నువ్వు తెల్లపాంటు, తెల్లషర్టు వేసుకుంటే ఎంతో బావుంటావ్..."

"బావుంది! నాకసలు తెల్లగుడ్డలే లేవు."

"అందుకే ఇదిగో ఈ డబ్బులు తీసుకెళ్ళి ఇవాళ సాయంత్రం తెల్ల పాంటు, షర్టు పీసెస్ తీసుకో," అంటూ తన గుప్పెట్లోవున్న నోట్లని నా చేతిలో పెట్టబోయింది.

"అదేవిటీ! ఎక్కడివీ డబ్బులు?" కంగారుగానూ, అయోమయంగానూ అడిగాను.

"నాన్నగారు నా పుట్టినరోజుకి శారీ కొనుక్కోమని ఇచ్చారు."

"మరి ఆ డబ్బులు కాస్తా నాకిచ్చేస్తే..."

"మరేం పర్లేదు. బస్సులో ఎక్కడో పోయాయని చెప్తాను." ఆ మాటల్ని ఎంతో మామూలుగా అనేసినా నా మనసులో విపరీతంగా నాటుకుపోయాయి. నేనంటే తనకెంత అభిమానం! తన కిష్టమైన డ్రెస్‌లో నన్ను

చూడాలని ఎంతగా వువ్విళ్ళూరుతోంది! నా మనసానందంతో ఉబ్బితబ్బిబ్బయి పోయింది.

"నువ్వు చెప్పినట్లే చేస్తాను. కానీ ఒక్క షరతు" అన్నాను.

"ఏవిటి?"

"నేను గుడ్డల్ని కొనుక్కోవాలని మా నాన్నగార్ని డబ్బడుగుతాను. అవి నీకిస్తాను. వాటితో నువ్వు గ్రీన్ టెరికాట్ శారీ, బ్లవుజు తీసుకోవాలి. ఓ.కే?" అడిగాను.

"అంటే బదులా?" ఆమె అలా అడగడంలో ధ్వనించిన బాధ నన్ను మరింత బాధపెట్టింది.

"అదికాదు! అలా చెయ్యడంవల్ల మనిద్దరి కోరికలూ తీరడమే కాకుండా మనం ఇంట్లో అబద్ధాలు చెప్పాల్సిన పని కూడా వుండదు" అన్నాను ఆమె ననునయిస్తూ.

దాదాపు ఓ అరగంట బ్రతిమాలింతర్వాత ఆమె అందుకు వొప్పుకుంది.

గిరుక్కున వారం తిరిగింది.

నేను తెల్లపాంటు, షర్టు; ఆమె గ్రీన్ శారీ, బ్లవుజు వేసుకుని క్లాస్ ఎగ్గొట్టి ఉదయశంకర్‌లో కాఫీ తాగి మరీ మాట్నీకి చెక్కేశాం, ఆమె పుట్టినరోజునాడు.

"సార్! మిమ్మల్ని మేనేజర్‌గారు పిలుస్తున్నారు." ప్యూన్ పలకరింపుతో ఆలోచనల్లోంచి బయటపడి, గబగబా మేనేజర్ రూమ్‌కేసి నడిచాను.

ఆయన్తో ఏవేవో ఆఫీసు విషయాలు హోరాహోరిన చర్చించి, ఓ అరగంట దాటింతర్వాత బయటపడ్డాను.

ఆ రోజు చెయ్యాల్సిన పనులెన్నో వున్నాయి. కానీ చెయ్యబుద్ధి పుట్టడంలేదు. ఆలోచనలు రాజేశ్వరిని వదిలి ఇవతలికి రానంటున్నాయ్!

డిగ్రీ చదివిన ఆ మూడేళ్ళు నేనెన్నటికీ మర్చిపోలేదు.

ఎన్నో అనుభూతులు!

క్లాసులోవున్న ఆ కాసేపూ దగ్గరే వుండి కూడా దూరాన్ని అనుభవించాల్సివచ్చినందుకు ఎంతో బాధపడిపోయేవాళ్ళం. కాలేజీ అయిపోగానే ఇద్దరం కలిసే బయల్దేరేవాళ్ళం. ఇంటికి వచ్చింతర్వాత కూడా ఏదో ఒక వంక పెట్టుకుని ఎవరో ఒకరి ఇంటిదగ్గరకి చేరి కబుర్లు చెప్పుకుంటూ గడిపేవాళ్ళం.

అప్పుడు మా ఇద్దరి మధ్యా ఏర్పడ్డ బంధాన్ని ఇద్దరి ఇళ్ళలోనూ గమనించే వుంటారు. కానీ మా పరిచయం హద్దులుమీరదన్న నమ్మకంతో ఏమీ చెప్పలేక వూరుకునేవాళ్ళు.

అయితే ఇద్దరి పెద్దలూ మా వివాహాన్ని హర్షించరనే విషయాన్ని మేం అప్పుడు గమనించలేకపోయాం. మా ఇద్దరి మధ్య కులం ఓ పెద్ద అడ్డుగోడ కట్టిందనే విషయాన్ని కూడా మేం గుర్తించలేదు.

డిగ్రీ అయిపోంగానే నన్ను వైజాగ్‌లో వున్న మా మావయ్య గారింటికి ప్రయాణం కట్టించారు.

నేను వెళ్ళనని మొండికేశాను. ఇక్కడేవుండి ఏదయినా ఉద్యోగం చూసుకుంటానని గొడవ చేశాను.

మామయ్యదగ్గరికి నన్నెందుకు పంపించాలనుకుంటున్నారో తెలుసు నాకు. ఆయన నాకు పోస్ట్‌గ్రాడ్యుయేషన్ తనింట్లో వుంచి చెప్పించడమే కాకుండా, ఉద్యోగాన్ని కూడా ఇప్పించి తన కూతుర్నిచ్చి చెయ్యాలనే వూహలో వున్నాడు. మావాళ్ళు కూడా దానికి మద్దత్తు నిస్తున్నారు. అందుకే ఈ ప్రయాణం.

ససేమిరా వెళ్ళనన్నాను.

వైజాక్ వెళ్ళకపోతే వెంటనే మరో పిల్లనెవరినైనా చూసి ముడే యించేస్తాను కాని, రాజేశ్వరితో తిరగనివ్వనని నాన్నగారు ఖచ్చితంగా చెప్పేశారు.

మామయ్య కూతుర్ని చేసుకోకపోతే తనే విషమో తిని చచ్చిపోతా నని అమ్మ బెదిరించసాగింది.

ఒక ప్రక్క కన్న తల్లిదండ్రులు...

మరో ప్రక్క ప్రాణానికన్నా మిన్నగా ప్రేమించిన రాజేశ్వరి...

ఎటూ తేల్చుకోలేని విషమ పరిస్థితి.

రాజేశ్వరి వాళ్ళింటికి బయల్దేరాను.

ఇంటికి తాళం వేసుంది.

ఆ రాత్రి అమ్మద్వారా అసలు విషయం తెలిసింది. కేవలం నానించి దూరం చేయాలనే ఆమెని వాళ్ళ తల్లిదండ్రులు స్వగ్రామానికి తీసుకెళ్ళారని, ఇంక తిరిగొచ్చేది ఆమె తల్లిదండ్రులేనని, ఆమె రాదని!

ఒక్కసారి పరిస్థితులన్నీ తిరగబడేసరికి వుక్కిరి బిక్కి రయ్యాను.

వైజాగ్ వచ్చేశాను.

తర్వాత రాజేశ్వరికి ఎన్ని వుత్తరాలు చూసినా జవాబులేదు.

ప్రతి రోజూ ఆమె తాలూకు జ్ఞాపకాలు గుర్తుకొచ్చి బాధించ సాగాయ్ ఆమెను చూడకుండా వుండడం ఇక నా వల్లకాదు. ఇంటికి బయల్దేరదామనుకొంటుండగా వచ్చింది - రాజేశ్వరి పెళ్ళి శుభలేఖ.

రాజేశ్వరి చచ్చినా ఈ పెళ్ళికి వొప్పుకోదు

బలవంతాన ఆమె తల వంచి వుంటారు.

వెంటనే పెళ్ళి ఆమెను తీసుకొచ్చేయాలి.

మరోసారి శుభలేఖను చూడగానే దుఃఖం ఆగలేదు.

ఆ రాత్రే పెళ్ళి!

మరికొన్ని గంటల్లో రాజేశ్వరి మరెవరికో స్వంతం అయిపో తోంది. ఎలా?

ఆ రాత్రంతా అలా ఏడుస్తూనే పడుకున్నాను.

మర్నాడుదయం లేచింతర్వాత ఓ విధమయిన నిర్లిప్తత మనసులో చోటు చేసుకుంది.

ఈపాటికి రాజేశ్వరి మరెవరికో స్వంతం అయిపోయి వుంటుంది. ఇప్పుడెంత బాధపడ్డా లాభంలేదు. రాజేశ్వరి నాది కాకపోయినప్పుడు మామయ్య కూతురు భవానైనా ఒకటే, మరో సుబ్బలక్ష్మైనా ఒకటే!

ఆ రోజునించే జీవితంలో రాజీపడడం మొదలుపెట్టాను. ఆ తర్వాత మళ్ళీ రాజేశ్వరిని చూడడమే పడలేదు.

ఇన్నాళ్ళ తరువాత ఇవాళ ఇలా హఠాత్తుగా కనపడింది. అప్పటికీ, ఇప్పటికీ ఆమెకు నామీదున్న ప్రేమలో ఏమాత్రం భేదంలేదు. ఇప్పుడూ తనని పూర్వంలాగానే అభిమానిస్తుంది.

ఠక్కున రాజేశ్వరి నవ్వు గుర్తుకొచ్చింది.

ఇంకా ఆ అందం నాకోసం పడిగాపులు పడుతోంది. విపరీతమైన గర్వం కల్గింది నాకు.

ఒక గంటముందు పర్మిషన్ తీసుకుని ఇంటికెళ్ళాను.

గబగబా పెట్టెలోవున్న పాంటూ, షర్టూ తీసి వేసుకున్నాను.

కుడిచేతికి గడియారం పెట్టుకుంటే రాజేశ్వరికి ఇష్టం. వెంటనే డియారాన్ని ఎడంచేతినించి కుడిచేతికి మార్చేశాను.

''నువ్వలా తెల్ల పాంటూ, షర్టూ వేసుకుని టక్‌చేసి, ఫుల్‌బూట్ వేసుకుంటే ఎంత బావుంటావో తెల్సా...'' రాజేశ్వరి మాటలు గుర్తుకొచ్చాయ్.

వెంటనే కుర్చీలో కూలబడి బూట్లు తొడగసాగాను.

ఇంతలో భవానీ కాఫీ తెచ్చి ఎదురుగావున్న టీపాయ్‌మీద పెట్టింది.

బూట్లు తొడుక్కోవడం కాగానే, ఒక్క గుక్కలో కాఫీ తాగి, బయటికి బయల్దేరాను.

''బయటికి వెళ్తున్నట్లున్నారుగా ఆ గుడ్డల్ని టైలరుకిచ్చి పోగూడదూ...'' నెమ్మదిగా అంది భవాని.

ఆ మాటలు వినబడగానే నాకు చ్రుర్రున మండింది.

''చెప్పేనుగా— ఆ గుడ్డల్ని నేను కుట్టించుకోనని...'' గబగబా బయటికొచ్చేశాను.

అటుగా పోతున్న ఆటోని కేకేసి, రాజేశ్వరి ఇంటి లొకాలిటీ చెప్పాను.

పది నిముషాలు కాకముందే ఆటో వాళ్ళింటి ముందాగింది.

నన్ను చూడగానే నవ్వుతూ ఎదురొచ్చింది రాజేశ్వరి.

ఆమెను చూడగానే విపరీతమైన ఆనందం కల్గింది. నేనామె అభిరుచులకనుగుణంగా తయారై వచ్చినట్లే, ఆమె నా అభిరుచులకు అనుగుణంగా అలంకరించుకుంది. గ్రీన్ శారీ, గ్రీన్ బ్లవుజు, పాపిట్లో కుంకుమ...

ఓహ్...రాజేశ్వరీ! ఇంకా నువ్వు నా ఇష్టాల్ని మరచిపోలేదన్నమాట! నువ్వేకాదు, నేనూ నీ ఇష్టాల్ని మరచిపోలేదు ఇదిగో అందుకు నిదర్శనమే ప్రస్తుత నా రూపం...

నవ్వుతూ మెట్లెక్కసాగాను.

"రండి...రండి...మీ కోసమే ఎదురు చూస్తున్నాం." నవ్వుతూ అంది రాజేశ్వరి.

ఆమె ఎర్రని పెదాల మధ్య, తెల్లని పలువరుస తళుక్కుమంది. యు ఆర్ ఎ బ్యూటీ క్వీన్ రాజేశ్వరీ! ఈ అందం ఎప్పుడూ నాదేననితెలిసి కూడా దూరంగా తిరుగుతున్న మూర్ఖుడ్ని. ఇవాళ్టితో ఆ మూర్ఖత్వానికి స్వస్తి చెప్పేస్తాను.

"రాజేశ్వరీ! నాకు గ్రీన్ శారీ అంటే ఇష్టమన్న సంగతి నీకింకా గుర్తుందా?" ఆమెకేసి నడుస్తూ ఆప్యాయంగా అడిగాను.

"గ్రీన్ శారీ అంటే మావారికెంతో ఇష్టం. వారి ఇష్టాలే నా అలంకరణలు..." ఆమె వెనక్కి తిరిగి "ఏమండీ! ఇంకా ఎంతసేపు మీ అలంకరణ? రవి వచ్చేశారు ..." గట్టిగా అంది.

ఆమె మాటలు వినగానే హతాశుడ్నయ్యాను. అతనింట్లోనే వున్నడన్నమాట! ఇంకా నయం తొందరపడలేదు.

"ఇదిగో వచ్చేశా ..." నవ్వుతూ బయటకొచ్చిన ఆ యువకుడ్ని చూడగానే ఇనుపరాడ్‌తో నెత్తిన మోదినట్లయింది.

తెల్ల పాంటు, తెల్ల షర్టు, ఫుల్ షూస్. కుడిచేతికి వాచీ ... అందంగా నవ్వుతూ విష్ చేశాడు.

నాకు మతి పోతోంది.

అక్కడ నిలబడలేకపోతున్నాను.

"కూర్చోండి ..." నవ్వుతూ అన్నాడతను.

కూలబడ్డాను పక్కనేవున్న కుర్చీలో.

"మీ గురించి అప్పుడప్పుడూ మా ఆవిడ చెప్తూంటుంది. మీరిద్దరూ మంచి స్నేహితులటకదా ..."

అతను చెప్పే మాటలు నా చెవిలో దూరడం లేదు. అప్పుడెప్పుడో రాజేంద్ర చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయ్ —

ఆడవాళ్ళకి తమ గురించికన్నా భర్త గురించే ఎక్కువ ధ్యాస! భర్తను తమ ఇష్టాలకి అనుగుణంగా తీర్చిదిద్దుకోవడం వాళ్ళకెంతో ఇష్టం అని.

నిజమే! అప్పుడు నేను తన భర్త నవుతాననే వుద్దేశంతో రాజేశ్వరి అలా ప్రవర్తించింది. ఇప్పుడా కోరికలన్నీ భర్తతో తీర్చుకుంటుంది. నేనిప్పుడు పరాయివాడ్ని... ఇంకా నయం ఇందాక ఇంకా చొరవ తీసుకునుంటే చెంప వాచిపోయి వుండేది.

చటుక్కున భవాని గుర్తుకొచ్చింది నాకు.

పిచ్చిపిల్ల! తనింటి ఖర్చుకిచ్చిందాంట్లో దాచి, నాకోసం తనకిష్టమైన గుడ్డల్ని కొంది. నేనేమో మొండిగా ఆలోచించి ఆమెను హింస పెట్టాను. వెంటనే వెళ్ళి అ గుడ్డల్ని టైలరు కివ్వాలి.

భవాని ఆ గుడ్డల్ని కుట్టించుకోమని నన్నెందుకు బలవంతం చేస్తోందో కూడా అర్థమైపోయింది.

తక్కున లేచి నిలబడ్డాను.

"ఇదేంటి! లేచి నిలబడ్డారు...?" ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"మళ్ళీ రేపు సాయంత్రం మా ఆవిడతో కలిసి వస్తాను. ఇప్పుడో అర్జంటు పనుంది. వస్తా..." వాళ్ళ మాటల్ని వినిపించుకోకుండా గబగబా బయటి కొచ్చేశాను. *

(యువ-జూలై 1979)

# పశువు

గిట్టల చప్పుడు, మువ్వల గణగణా విన్పించేసరికి మెలకువొచ్చింది వీరయ్యకి.

బసవన్న తాడు తెంపుకు వెళ్ళిపోతుందా? చటుక్కున లేచి కూర్చున్నాడు.

మంటపం పక్కకి చూశాడు.

అక్కడ బసవన్న మాగన్నుగా పడుకొనుంది!

ఆ మసక చీకట్లో ఒంటెద్దు బండొకటి రోడ్డు వెంట వెళ్తోంది. దాంట్లో నల్గురాడవాళ్ళు కూర్చుని గట్టిగా మాట్లాడుకుంటూ నవ్వుకుంటు న్నారు.

రైలు కెళ్తున్నారేమో? అనుకున్నాడు వీరయ్య.

ఆ మట్టిరోడ్డు మీద ఓ అరమైలు వెళ్ళి తర్వాత తార్రోడ్డెక్కి దాదాపు మైలు దూరం వెళ్తే గానీ రైల్వేస్టేషన్ రాదు. అందుకని ఆడవాళ్ళెవరైనా రైలు కెళ్ళదల్చుకుంటే - స్టేషన్ దాక ఇలా ఏ ఎద్దుబండి మీదో వెళ్తారు. మగవాళ్ళు అయితే మరింత పొద్దుండగానే బయల్దేరి నడిచి వెళ్తారందాకా!

వీరయ్య దృష్టి మళ్ళా బసవన్న వేపు మళ్ళింది.

చల్లగా కురుస్తున్న ఆ మంచులో పడుకొనుంది. దాన్నలా చూస్తుంటే ఎముకల గూడులా అన్పించింది వీరయ్యకి. వెంటనే తనవేపు చూసు కున్నాడు.

తనూ అలాగే ఉన్నాడు, బక్కచిక్కి అస్థిపంజరంలా. పగలల్లా తిరుగుడు, చాలీచాలని తిండి, యీ మంటప నిద్ర - మరింకెలా ఉంటాడు?

ఈ బసవన్న తప్ప వెనకా ముందూ ఎవరూ లేరు తనకి. నెల రోజులకో వూరు మారుస్తూ, ఇలా గంగిరెద్దు నాడించుకుంటూ బిచ్చమెత్తుకు బతకడమే తన జీవితం!

ఎంతో అసంతృప్తిగా అన్పించింది పీరయ్యకి.

ఆ మంటపం దాదాపు వూరు మధ్యగా అటు పంచాయితీ ఆఫీసుని, ఇటు శివాలయాన్ని పరామర్శిస్తూ నాల్గు వీధుల కూడలిలో ఉంది. తన లాంటి దిక్కుమాలిన వాళ్ళందరికీ అదే దేవేంద్ర భవనం, (పగలల్లా వూళ్ళోని పెద్దలు పేకాడుకోడానికి ఉపయోగపడుతుంది. అది వేరే విషయం. పీరయ్యలాంటి వాళ్ళకా మంటపమవసరం రాత్రి తల దాచు కోడాన్కేగా?) ప్రస్తుతం ఇరవై రోజుల్నుంచీ రాత్రిళ్ళు తను దాన్నా క్రమిస్తున్నాడు. మూడ్రోజుల్నించీ ఇంకో సన్నాసి కూడా దాన్లోనే మరో మూల ఇరుక్కున్నాడు!

అటు చూశాడు పీరయ్య.

ముడుచుకొని పడుకున్నాడు సాంబయ్య.

మెలకువొచ్చినా లేవబుద్ధి పుట్టడం లేదు పీరయ్యకి.

ప్రతిరోజూ యిది మామూలే. ఇలా మెలకువొచ్చిన ఏ అరగంటకో గానీ లేవలేడు!

(పీరయ్యకి మెలకువ రాగానే వూళ్ళో ఉన్న పెద్ద మనుషులంతా గుర్తుకొస్తారు. తర్వాత వాళ్ళ దర్జా గుర్తుకొస్తుంది. ఆ తర్వాత వాళ్ళు తనలాంటి వాళ్ళని చూసే నీచమైన చూపు గుర్తుకొస్తుంది. అంతే! అతని రక్తం కుతకుతలాడిపోతుంది. వీళ్ళ పొగరు మొత్తనాన్ని ఎలా అణచాలా

అని మనసు పరిపరి విధాలా పోతుంది. వళ్ళంతా వేడెక్కి పోతుంది. కానీ అప్పుడు తక్కున వాళ్ళనేమీ చేయలేని తన అసమర్థత గుర్తుకొస్తుంది. నీళ్ళుగారిపోతాడు. తన్ని తన్నే తిట్టుకుంటాడు ... ఇలా కొంతసేపు జరిగిన తర్వాతగానీ లేచి పన్లకుపక్రమించడు.)

—లేచి బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాడు వీరయ్య.

మంటపం దిగి, ఆప్యాయంగా బసవన్నని నిమిరాడు.

అతని చెయ్యి మీద పడగానే ఆశగా అతని వంక చూసింది బసవన్న. వీరయ్యకి దానిమీద విపరీతమైన జాలేసింది.

(జాలి పట్టం కన్న తనేం చేయగల్డు?) పక్కనే వున్న వేపచెట్టు వేపు కదిలాడు. అందుబాటులో నున్న ఓ కొమ్మ నందుకొని విరిచాడు.

"ఏరోజు పుల్ల ఆరోజు తెంపుకోబోతే ఒకేసారి నాల్రోజుల కొచ్చేట్టు పుల్లలు తెంపుకోరాదూ? ఏం మడిసివయ్యా?... సర్లే. నాకూ ఓ పుల్ల పారేయ్.'' సాంబయ్య లేచి, తన చిరుగుల గొంగళిని దులిపి- మడతబెట్టు కుంటూ అన్నాడు.

వీరయ్య కడుపు మంటగా నవ్వేడు.

''రేపటి కోసం- ఇంకొచ్చే నాల్గు తరాల కోసం ఇయాల సంపా యించి పెట్టుకోడాన్కి నేనేమన్నా కర్ణంగోర్నా? మున్సబుగోర్నా? లేక పెద్దరెడ్డిగోర్నా? ఛత్... మన కట్టాటివి గిట్టవ్. మనకి రేపనేదుండాలేగానీ, సెట్టట్టాగే వుంటది! ఏరోజు పుల్ల ఆరోజే తెంపుకుంటాను. నాకేం బద్ధకంలేదు. అయినా సన్నాసోడివి నీకూ్కడా రేపటి యావేందయ్యా? ఇంద పట్టు—'' అంటూ ఓపుల్ల అతనివేపు విసిరేశాడు వీరయ్య.

కాలకృత్యాలు తీర్చుకుని బసవన్న దగ్గర కొచ్చాడు. అతన్ని చూడగానే బసవన్న లేచి నుంచుంది.

మంటపంలో వేసుకున్న పక్కని దులిపి మ
బసవన్న వీపుమీద వేశాడు. దానిమీద తన పంచెలు, చ
వేశాడు. అంచులు చివర విరిగిన సన్నాయిని నొక్కి
అపస్వరాలొచ్చాయ్!

'యదవ బతుకు-యదవ మేళం.' సణుక్కుంటూ

మంచుపడి మట్టిరోడ్డు చదునుగా వుంది. ఇదే
సరికి తడారిపోయి విపరీతంగా దుమ్ములేస్తుంటుంది.

భోగి మంటల ముందు వేప్పుల్లలు నములుతూ,
చెప్పుకుంటూ చలి కాచుకోవటం అయిపోయి ఒక్కొక్క
దేరుతున్నారు. ప్రతివీధి మొదట్లోనూ ఇలాంటి మంట
ఉన్నాయి. ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోవడంతో మనుషుల్లే
దుంగలేమీ వెయ్యకపోయినా- అంతకు ముందున్న నిప్పే
రోడ్డు మధ్య ఉన్న వాటి నార్పాలనే ధ్యాసెవ్వరికీలేదు.

పీరయ్యకి బోణీమీద మంచి నమ్మకముంది.

'ఆ ఎత్తరుగుల బాపనాళ్ళింట్లో ఓయమ్ముంది -
గుప్పెడు బిచ్చం ఏసిందా-నాసామిరంగా ఆరోజు తనెద్ద
క్కనే!' ఆశగా ఆ యింటి ముందుకొచ్చి ఆగాడు.

''అమ్మగోరికి దన్నం పెట్టు... అయ్యగోరికి ద
సన్నాయి వూదడం ప్రారంభించాడు.

తిండిలేక డొక్క లెళ్ళు కొచ్చిన ఆ ఎద్దు హ
వూపల్లు దేబలాగా అలాగే నిల్చుంది.

"అమ్మా! కూసిని వడ్లో, బియ్యమో ఇప్పించ
అడిగాడు.

"పోవయ్యా! చెయ్యి ఖాళీగా లేదు." రోజూ తెల్లారేసరికల్లా ప్రత్యక్ష మయ్యే అతన్ని చూసేసరికి అసలే చిరాగ్గావున్న ఆమెకి మరింత చిరాకేసింది.

వీరయ్య సెంటిమెంటు దెబ్బతింది. ప్రాణం వుసూరుమంది. చివ్వున కోపం ముంచుకొచ్చింది. అయినా రోజూ వేసే మనిషి కావడంతో మారు మాట్లాడలేక ముందుకు నడిచాడు.

అప్పటికే ప్రతి యింటిముందు చక్కగా చిమ్మి, కళ్ళాపిజల్లి రక రకాల ముగ్గులుపెట్టి వున్నాయ్. ముగ్గుల మధ్య గొబ్బిళ్ళు కూడా ఉన్నాయ్. అలా వాటి మధ్యగా నడుస్తుంటే చెప్పలేనటువంటి చక్కని అనుభూతి కల్గుతోంది వీరయ్యకి.

సంక్రాంతి పండుగ దగ్గర పట్టంతో వూళ్ళో నూతన చైతన్యం వచ్చింది. సందడి బాగా పెరిగింది.

'పండగ రోజులో -బిచ్చం పెరగాల్సిందిపోయి తగ్గిపోతోంది, రోజులు మారిపోయాయి...' సణుక్కుంటూ ఆ పక్కనే వున్న ప్రెసిడెంటుగారి మేడ కేసి నడిచాడు.

మేడ చుట్టూతా బోల్డంత స్థలం. పెద్ద ప్రహారీగోడ. వీధి గుమ్మంలో నిలబడి సన్నాయి వాయించడం ప్రారంభించాడు.

పంట ఇంటికొచ్చినట్లుంది. పాలేళ్లు హడావుడిగా వున్నారు. ప్రెసిడెంటుగారు పాతకాలంనాటి కొయ్యకుర్చీ ఒకటేసుకుని కూర్చుని ఆజ్ఞలు జారీ చేస్తున్నారు. ఆయన నోట్లో పెద్దచుట్ట కాల్తోంది.

కాసేపు సన్నాయి వాయించి అలవాటు ప్రకారం ప్రారంభించాడు.

"ప్రెసిడెంటు గోరికి దన్నం పెట్టు. దరమ పెబువుకీ దన్నం పెట్టు..." ఎద్దు మీదవాలిన ఈగల్ని తోలుకోడాన్కి తల, తోక ఆడించింది.

అతని గొడవక్కడెవ్వరూ పట్టించుకోవడం లేదు.

సన్నాయి గట్టిగా వూదడం ప్రారంభించాడు.

ప్రెసిడెంటు గారికి చిర్రెత్తుకొచ్చింది.

"బాబూ! కొత్తవడ్లో...బియ్యమో..." సణిగాడు.

"ఏందిరా గోల నాయాల! ఫో... అవతలికి..." విసురుగా కసిరి మళ్ళీ తన గొడవలో పడిపోయాడు.

వీరయ్య కదల్లేదు. తిరిగి సన్నాయి నూదడం ప్రారంభించాడు: ఇటువంటి కసుర్లకి, విసుర్లకి అతను అలవాటుపడిపోయాడు. పేదవాడి కోపం పెదవికి చేటనే విషయం అతనికి బాగా తెల్సు. అందుకే అన్నింటిని భరిస్తూ బిచ్చం పడేంతవరకూ గుమ్మాన్నొదలడు.

ప్రెసిడెంటు గారి కోపం తారాస్థాయికి చేరుకుంది.

"గాడ్దెకొడకా! మా గొడవేందో మేం పడ్తుంటే మధ్య నీ గొడవేంది?"

"నా కివాళ్టికి తిండిలేక నేను కొట్టుకుంటూంటే ఈ నాయాల్లెప్పటికో దాసుకుంటున్నారు. పక్కాడు ఆకల్తో సత్తావుంటే-ఈల్లు తమ కడుపులు, గోదాలు నింపుకుంటూండారు. ఈల్లనవాల్సిన పన్లేదు. డబ్బు-ఆ ఎదవ డబ్బు సేత్తా వుందంతా! తను, తన పెళ్ళాం, పిల్లలు అంతే! పక్కాడు తిండిలేక సచ్చినా పర్లేదు. ఇలాంటి సార్థపు నాయాల్లనేం చేసినా పాపం లేదు." సణుక్కుంటూ అక్కడ్నించీ కదిలాడు తన బక్క ఎద్దుతో.

ఆ పక్కనే ఓ కొట్టుంది.

అప్పుడే తలుపులు తీసినట్లున్నాడు లక్ష్మయ్య; సర్దుకుంటున్నాడు.

అతని చుట్టూ చిన్న చిన్న అరల్లో రకరకాల దినుసు లున్నాయ్. ముందు పెట్టెల్లో రకరకాల పప్పు ధాన్యాలున్నాయ్. ఒక మూల బెల్లపు

అచ్చులు...ఈగలు జుయ్‌మని ముసురుకుంటున్నాయ్. పక్కనే కొన్ని హార్లిక్స్ సీసాల్లో వేరుశెనగ ఉండలు, నువ్వు జీడీలు, చౌకరకం పిప్పరమెంట్లు ఉన్నాయ్. ఒక పళ్ళెంలో జంతికలున్నాయ్. సగం గెల అరటి పండ్లకి పైనే వేళ్ళాడుతున్నాయ్. అందులో సగం కుళ్ళిపోయి ఉన్నాయ్!

—ఇవన్నీ పరికిస్తూ నిరుత్సాహంగా సన్నాయి వాయిస్తున్నాడు వీరయ్య, బసవన్న మరింత నిర్లిప్తంగా నిలబడిందతని ప్రక్కనే.

బియ్యం కొలిపించుకోడాన్కి అప్పుడే కొట్లోకి వచ్చిన రంగితో రెండర్థాల మాటలు మాట్లాడుతున్న లక్ష్మయ్యకి వీరయ్య సన్నాయి వాయిద్యం కర్ణకఠోరంగా విన్పించింది.

"పొద్దున్నే ఎదవగోల. బేరాలకన్నా ముందే మొదలు. ఫో... అవతలకి."

వీరయ్యకి వళ్ళు మండిపోయింది.

"అడిగినోడు, పెట్టినా పెట్టకపోయినా రెండోవాడికి లోకువే! పెతీ ఎదవా పో అవతలికి, పో అవతలికి ... ఇలా ఎన్ని మాటలన్నా భరించాలి."

కొట్టు కొచ్చిన వాళ్ళల్లో ఒకళ్ళు ఒక నయాపైస బిళ్ళ అతని చేతిలోకి విసిరేశారు.

"హుఁ! పైసా! ఇలాంటి ఎన్ని పైసలు గలుత్తె ఒక రూపాయవుద్ది...కడుపు నిండుద్ది..సీ.సీ ఎదవ బ్రతుకు." పౌరుషంతో పక్కకి కదిలాడు వీరయ్య.

తన కొట్టు కొచ్చిన వాళ్ళల్లో ఒకరు పైసా ధర్మం చెయ్యడంతో లక్ష్మయ్యకీ పౌరుషం ముంచుకొచ్చింది. వీరయ్య నాగమని ఓ కుళ్ళిన అరటిపండుని గెలలోంచి తుంచి—

"ఎదవా! ఎంతసేపటికీ నీ కడుపు సంగతే సూసుకుంటావ్ గానీ, ఎద్దు సంగతి సూట్టల్లేదల్లే ఉంది. పిచ్చిముండ ఎలా ఉందో సూడు— ఎముకలన్నీ బయటికొచ్చి! ఈ పండుని దానికిపెట్టు." ఆ పండుని విసిరేశాడు. వీరయ్య దాన్ని కిందపడకుండా పట్టుకుని బసవన్న నోటి ముందుంచాడు.

దాన్ని వాసన చూసి వద్దన్నట్లు తల పక్కకి తిప్పింది బసవన్న.

పండుని పక్కకి పారేసి బయల్దేరాడు వీరయ్య.

బసవన్న ఆశగా అరటిగెల కేసి చూస్తూ కదల్లేదు.

వీరయ్యకి చిర్రెత్తుకొచ్చింది.

'ఇదొక కరువు మేలం! ఎంతసేపటికీ తిండి ధ్యాసే! ఆ నాయాల్లకే మాత్రం తీసిపోదు. నీ ఎద్దునమ్మ - కదలయే.' చేత్తో గట్టిగా పొడిచాడు బసవన్నని. అది నెమ్మదిగా కదిలింది.

అతను - అతని వెనకే ఎద్దు.

ఎక్కే గడప—

దిగే గడప!

పెట్టేవాళ్ళు పెడుతున్నారు.

తిట్టేవాళ్ళు తిడుతున్నారు!

వీరయ్య మనసు మండిపోతోంది. తన కోపమేమాత్రం బయట పడకుండా బలవంతాన తనలోనే అణచుకున్నాడు.

ఎండకూడా అతని బతుకులాగే అంతంత మాత్రంగానే వుంది.

'ఇయ్యాల లేచినేల బావుళ్ళేదు. ఒక్క కొంపలోకూడా గుప్పెడు గింజలు దొరకలేదు. గంగిరెద్దులాడంటే పిల్చి బియ్యం, వడ్లు పెట్టే రోజులు పోయాయ్. తిన్నవాడు మరింత పోగేసుకుని దాచుకునే

ప్రయత్నం!దరమం మాటే మరసిపోయారు. సీ...సీ...ఎదవ పెపంచం. సోసకొచ్చేట్టుంది.ఆ యమ్మెవరో సద్దన్నం మిగిలిపోయినట్టుంది పిలిచి మరీ పడేసింది, వెంటనే తినాలి. లేకపోతే కళ్ళు తిరిగి పడిపోగల్ను.'నెమ్మదిగా ఎద్దుని నడిపించుకుని నడిగెడ్డపాలెంకేసి నడక సాగించాడు.

అప్పుడతనిలో తన ఆకలి గురించే ఆలోచన. అంతే.

డొంక చేరుకోగానే తుంగభద్ర ఒడ్డున ఓ చెట్టు నీడన కూలబడ్డాడు - అడుక్కోగా వచ్చిన అన్నం మూటతో.

ఆత్రంగా గబగబా తినసాగాడు.

కాగానే —

అన్నం మూటగట్టిన గుడ్డని దులిపి భుజాన వేసుకొని తుంగభద్రలో కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. ఆ గుడ్డతోనే తుడుచుకున్నాడు.

కడుపులో కొద్దిగా పడేసరికి నిద్ర ముంచుకు రాసాగింది. చెట్టు నీడనచేరి కునుకు తీద్దామనుకున్నాడు.

కానీ ఎలా?

ఇవ్వాళసలేమీ దొరకలేదు.

కాసేపు పడుకోవాలనే ప్రయత్నాన్ని విరమించుకుని బసవన్న దగ్గరకెళ్ళాడు, అది నీరసంగా కూలబడి వేదాంతిలా చూస్తోంది తనవంక.

దగ్గరకు రాగానే లేచి నిల్చుంది-ఆశగా చూస్తూ తోక కదిల్చింది.

"దీనమ్మ...దీనికి గడ్డి తినిపించి రెండు రోజులైంది. తన చేతిలో ఏగానీ లేందే దానికేం తినిపించగలడు గడ్డి?" బసవన్నమీద జాలి పడ్డాడు వీరయ్య.

బసవన్నని తుంగభద్ర నీళ్ళదగ్గరకి తీసుకెళ్ళి ఒళ్ళంతా ప్రేమగా కడిగాడు. తన దగ్గరున్న గుడ్డతో దాన్ని తుడిచి, తుడిచిన ఆ గుడ్డని దాని వీపుమీదే ఆరేశాడు.

బసవన్న వీపుమీద కప్పున్న బొంతకి రెండువేపులా రెండు సంచీ లున్నై. ఒక పక్క ఎవరయినా పెట్టిన బియ్యం, వడ్లు మొదలైనవి వేసు కోవడానికి వీలుగా రెండు మూడర లున్నాయి. రెండోపక్క సంచిలో గిన్నె కంచం గుడ్డలు మొదలైన వస్తువులు పెట్టుకుంటాడు.

నెమ్మదిగా ఎద్దుని కదిలించుకుని బయల్దేరాడు పక్కనున్న పల్లెకి. ఇలా రోజుకు మొత్తంమీద రెండుమూడు పల్లెల్లోనైనా అడుక్కుంటాడు.

తిరిగి మామూలే.

ఎక్కే గడప-దిగే గడప.

నాలుగు డబ్బులు, కొద్దో గొప్పో బియ్యం, వడ్లు వచ్చాయి.

రాత్రి ఏడుగంటల సమయంలో తిరిగి మంటపం జేరుకున్నారిద్దరు.

మండపం పక్కనే రావిచెట్టు, వేపచెట్టు మొలిచాయి. వాటి రెంటికీ బ్రహ్మాండంగా పెళ్ళి చేసినట్లున్నారు. పసుపు, కుంకుమ, దాని చుట్టూ రచ్చబండ - ఇవే అందుకు నిదర్శనాలు.

"నా కడుపు కాల్తుంటే ఇంత బిచ్చమేయడాని కూడా ఏడిసే పెద్దలు సందాలేసుకుని ఈ సెట్లకి పెల్లి సేయించుంటారు.

మరమన్నేయం... ఈళ్ళనేం చేసినా పాపంలేదు'' అతని మనసు ఉక్రోషంతో వుడికి పోతోంది.

నడిచి నడిచి కాళ్ళు నెప్పులు పుడుతున్నాయి.

నడుం లాగుతోంది.

బసవన్నని మంటపం పక్కనే వున్న గుంజకి కట్టేసి దాని మీదున్న బొంత నందుకుని మంటప మెక్కాడు.

బసవడు కూడా నిలవలేక కూలబడ్డాడు!

దానికీ కాళ్ళు లాగుతున్నాయి, కడుపు మండుతోంది.

వీరయ్య ఆరోజు వచ్చిన బియ్యం, వడ్లు- డబ్బులు అన్నీ వేరుచేసి, లెక్క చూసుకున్నాడు.

కడుపు మండుతోంది.

మంటపం కింద రాళ్ళు చేర్చి పక్కనే వున్న చింతల తోపులో కెళ్ళి, కొన్ని చితుకులేరుకొచ్చి పొయ్యి రాజేశాడు. బొంత సొరుగులోంచి గిన్నెనితీసి తను తెచ్చిన బియ్యం దాంట్లో పోశాడు. పక్కనే వున్న పంపు దగ్గర కెళ్ళిబియ్యం కడిగి పొయ్యిమీద పడేశాడు.

మంట ఆరిపోకుండా మధ్య మధ్య చితుకుల్ని పొయ్యిలోకి తోస్తు న్నాడు.

అతని మనసులో కూడా మంటలు రేగుతున్నాయ్!

'తన్లాంటివాడు తింటానికీ లేక, పడుకోడానికి లేక ఇలా నానా అవస్థలు పడుతూ వుంటే నాయాల్లు పొట్టలు పగిలేట్టు తిని మరో జనమ కూ్కడా సరిపడా ఇనప్పెట్టెలాంటి ఇల్లల్లో దాచుకుని సుకంగా ఉంటు న్నారు. అల్లూ మడుసులే నేను మడిసినే! మరి మా యిద్దరి జీవితాల్లోనూ ఈ తేడా ఏంది?' కడుపు మంటగా కరణం గారింటివేపు జూస్తూ అను కున్నాడు వీరయ్య.

ఇంతలో సాంబయ్య కూడా అక్కడికే జేరుకున్నాడు.

తెగ తిరగడంలో వీరయ్యకి ఒళ్ళంతా నొప్పులు పుడుతున్నాయ్.

'ఇది ఒక రోజుతో పోయేది కాదు. పెతీ రోజూ ఉండేదే. ఏరోజూ తిరక్కపోతే ఆ రోజు కూడుండదు తనకి. నాయాల్లు అల్లు మాత్రం ఇంట్లోంచి కదలకుండానే మిద్దెమీద మిద్దెమీద కట్టేస్తుండారు. అబ్బా-వల్లంతా నొప్పితో సలుపుతోంది. కాస్తంత సుక్కపడితే గానీ నొప్పులు తగ్గవు. ఉన్న నాల్గు డబ్బులూ అందుకు సాలవే...ఎదవొడ్లు ఇవుండి మాత్రం

తనకెందుకూ? వీట్ని లచ్చమ్మ కొట్లో పడేసి డబ్బులు తీసుకుంటే గానీ సుక్కకి సరిపోదు...' అన్నం వుడికితే దించమని సాంబయ్యకి చెప్పి - వడ్లు కొట్లో పోసి- వచ్చిన డబ్బుల్తో వడివడిగా మొగలి డొంకకేసి కదిలాడు.

దాదాపు ఓ ఇరవై నిమిషాల తర్వాత తడబడ్తూ తూల్తూ మంటపం జేరుకున్న వీరయ్యలో నూతన చైతన్యం చోటు చేసికొంది.

ఈలోపల వుడికిన అన్నాన్ని సాంబయ్య దించడం, దాంట్లో కొద్దిగా కతకడం, నిద్రపోవడం కూడా అయిపోయింది.

ఎవరో దానం చేసిన పచ్చడితో త్వర త్వరగా రెండు మెతుకులు తిని, బొంతమీద అడ్డం పడిపోయాడు వీరయ్య.

ఆతనికి కొద్దిదూరంలోనే గుప్పెడు గడ్డి కోసం అలమటించి పోతున్న ఎద్దు కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఇంకా ఆశ చంపుకోలేక ఆతని వంకే ఆశగా చూస్తోంది.

తన ఆకలి గురించి ఎవరూ పట్టించుకోవడం లేదని అందర్నీ శపించిన వీరయ్య కూడా తన ఆకలి తీరేసరికి అందరిలా మారిపోయాడనీ, ఇప్పుడతనికి అంతవరకూ తనుపయోగించుకున్న ఎద్దు ఆకలి గుర్తుండదనీ, దాని ఉనికి అతడు తిరిగి గుర్తించేది మర్నాడు ఉదయమేననీ-అయినా అది అతని తప్పుకాదనీ-అసలు మనిషి నైజమే అంతనీ దానికి తెలీదు.

ఒకవేళ తెల్సినా వీరయ్యలా అడుక్కోవడంగానీ, ఆకలి తీర్చని వాళ్ళని శపించడం గానీ దానికి చేతకాదు.

అందుకే ఇంకా ఆశగా, దీనంగా ఆతని వేపే చూస్తూంది. *

(సౌమ్య మాసపత్రిక మార్చి 1979)

# తప్పుకదూ?

"తప్పుకదూ? బట్టలు కట్టుకుంటుంటే అలా రావచ్చా?" రాణి కోసం వాళ్ళ ఇల్లంతా వెదకి, మూసివున్న ఆ గది తలుపుల్ని హఠాత్తుగా తెరచి, అర్ధనగ్నంగా వున్న రాణిని మతిపోయి చూస్తూ నిల్చున్న నేను ఆమె మందలింపుతో ఈ లోకంలోకి వచ్చాను.

సభ్యతకాదు వెనక్కి వెళ్ళిపోవాలనిపించినా కాళ్ళు కదలనని మొరాయించాయి.

లంగా మాత్రమే వేసుకుని జాకెట్టు వేసుకోబోతున్నదల్లా తలుపులు హఠాత్తుగా తెరచుకోవడంతో సిగ్గుతో గువ్వలా ముడుచుకుపోయింది. నా దృష్టి ఆమె నున్నటి భుజాల్ని దాటి ఇవతలికి రావడంలేదు. ఆమె భుజాల మీదనుంచి జారుతున్న నీటి బిందువుల్ని చూస్తూ అలాగే నిలబడి పోయాను.

"తప్పుకదూ..." మరోసారి రాణి మందలింపుతో ఈ లోకంలోకి వచ్చి "మీ అమ్మగారు మా ఇంట్లో వున్నారు. పిండి జల్లెడ నిన్నడిగి తెమ్మంటే..."

"నే వస్తున్నాలే పద..."

కదలనని మొరాయించిన కాళ్ళని బలవంతాన బయలుదేరతీశాను. నేను గడప దాటగానే భళ్ళున తలుపులేసేసింది రాణి.

రోజులు గడిచినకొద్దీ మరుగునపడడం మాటటుంచి ఈ సంఘటన మరింత అందంగా మనసులో రూపులు దిద్దుకోసాగింది.

ఆరోజు—

నా భావాలనయితే మొండిగా ధైర్యంచేసి అక్షరరూపంలోకి మార్చి ఆమె ముందు వుంచగలిగానుగాని, ఆమె ఎలాంటి భావాన్ని వ్యక్తపరుస్తుందోనని భయపడిపోసాగాను.

భయపడ్డంతా జరిగింది.

"తప్పు కదూ? ఇటువంటి ప్రేమలేఖల్ని ఆడపిల్లలకి రాయవచ్చా? చదువు మాని నువ్వు చేస్తున్న పని ఇదా? మళ్ళీ ఇటువంటి రాతల్ని రాసావంటే మీ నాన్నగారి ముందు నిలబెడతాను జాగ్రత్త!" నేనెంతో కష్టపడి రాసిన వుత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చేసి గట్టి వార్నింగ్ ఇచ్చింది రాణి.

ఆ తర్వాత మళ్ళీ ఎప్పుడూ ఆమె ముందు నా ప్రేమని వ్యక్తపరిచే ప్రయత్నం చెయ్యలేదు. మరుసటి సంవత్సరంలోనే వాళ్ళ నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ కావడంతో ఆ వూరు నుంచి వెళ్ళిపోయారు రాణీవాళ్ళు.

తర్వాత కొన్నాళ్ళవరకూ వాళ్ళ కుటుంబానికి, మా కుటుంబానికి మధ్య ఉత్తరాలు నడిచాయి. క్రమేపీ అవి కూడా తగ్గిపోయాయి. చివరికి వాళ్ళెక్కడ వున్నారో కూడా మాకు తెలీని పరిస్థితి వచ్చింది.

ఇన్ని సంవత్సరాల తర్వాత రాణిని ఇవాళ చూసాను. కానీ ఆ ఆనందం నాలో ఎక్కడా లేదు. ఆమె ఈ పరిస్థితికి ఎలా దిగజారింది? ఇదే నా బాధ.

"ఏరా! ఇంకా ఆ కిటికీ దగ్గరే కూలబడున్నావ్!...లే...లే... త్వరగా స్నానం చేసిరా." శేఖరం పలకరింపుతో ఆలోచనల్లోంచి బయటపడ్డాను.

"ఇవాళ అర్జంటు పనుంది. ఆఫీసుకి వెళ్ళకతప్పదు. రేపటినుంచీ నువ్వు తిరిగి వెళ్ళిపోయేవరకూ శెలవు పెడతాను. ఈరోజు మాత్రం

బోరయినా భరించు...అన్నట్టు బోరెందుకు, భోంచేసి నేనటు ఆఫీసుకి వెళ్ళగానే, నువ్విటు తిరిగివచ్చి మీ స్వప్నసుందరితో కాలక్షేపం చెయ్యొచ్చు. సరేనా..." నవ్వాడు వాడు.

చిరాకేసింది నాకు. నా మనసు వాడికి అర్థంకాదు. వాడితో చెప్పుకోవడం గూడా అనవసరం. వాడి వాక్ప్రవాహానికి అడ్డం వెయ్యడం ఎలాగో తెలీక స్నానానికి బయలుదేరాను.

స్నానం చేస్తున్నంతసేపూ కూడా రాణి ఆలోచనలు నను విడిచి పెట్టలేదు.

ఎన్నోసార్లు "తప్పుకదూ!" అంటూ నాలో వివేకాన్ని తట్టి లేపడానికి ప్రయత్నించిన ఆమె ఇలాంటి పెద్ద 'తప్పు'లోకి ఎలా దిగజారింది?

ఇది నా బుర్రని బద్దలు కొడుతున్న ప్రశ్న.

దీనికి జవాబు చెప్పగల వ్యక్తి రాణి ఒక్కర్తె! అందుకనే శేఖరం ఆఫీసుకి వెళ్ళగానే ఆమెని కలవాలని నిర్ణయించుకున్నాను.

హోటల్లో భోంచేసిన తర్వాత శేఖరం ఆఫీసుకి వెళ్ళాడు. నేను వెనక్కి తిరిగాను.

ఇల్లు సమీపిస్తున్నకొద్దీ గుండెలు గట్టిగా కొట్టుకోసాగాయి. చెప్పలేని ఆందోళన.

ఇంతకు ముందు ఎన్నోసార్లు 'తప్పుకదూ' అంటూ నన్ను మందలించిన రాణిని ఇప్పుడు నేను 'తప్పుకదూ' అంటూ మందలించబోతున్నాను. కొద్దిగా గర్వంగా అనిపించింది. గుండె దడ కొద్దిగా తగ్గింది.

రాణి ఇంటి గుమ్మం మెట్లెక్కాను.

తలుపులు వేసున్నాయి.

నెట్టాను.

గడియవేసి వుండడంతో తలుపులు తెరచుకోలేదు.

తలుపుల మీద శబ్దం చేశాను.

"వస్తున్నా..." లోపల నుంచి వినిపించింది.

ఆ గొంతుని వెంటనే గుర్తు పట్టాను.

మనిషిలో ఎంత మార్పొచ్చినా రాణి గొంతులో మాత్రం ఎటువంటి మార్పూ రాలేదు.

కొన్ని క్షణాల్లో ఆమెని మందలించబోతున్నాను. తప్పదు!

తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా రాణి!

గడప అవతల ఆమె, ఇవతల నేను!

ఒక్క క్షణం నిశ్శబ్దం... బ్రహ్మాండం బ్రద్దలయే నిశ్శబ్దం!

ముందామే తేరుకుంది.

"తప్పుకదూ? ఇట్లాంటి ఇళ్ళ వేపు నువ్వు రావచ్చా? వెళ్ళు ... మళ్ళీ ఎప్పుడూ రాకు..." భళ్ళున నా మొహం మీదే తలుపులు వేసేసింది.

నా కాళ్ళ క్రింద భూమి కదిలిపోతున్నట్లనిపించింది. అక్కడ నిలబడలేక గబగబా రూమ్ వేపు బయల్దేరాను. *

(విజయ మాసపత్రిక-ఏప్రిల్ 1985)

# మంచి మనిషి

ఆఫీసుల్నించి వచ్చేవాళ్ళతోనూ, స్కూళ్ళనించి వచ్చే పిల్లల్తోనూ, షికారుకి, బజారు పన్లమీదా బయల్దేరిన వాళ్ళతోనూ, బస్సుల్తోనూ, రిక్షాల్తోనూ, స్కూటర్లతోనూ, సైకిళ్ళతోనూ - అబిడ్స్ నానా హడావిడిగా వుంది. అంత ట్రాఫిక్ మధ్య, ఆ మోతల్ని వింటూ నించోడమంటే కొంచెం ఇబ్బందిగానే వుంది.

విసుగ్గా వాచీ చూసుకున్నాను.

అయిదూ యాభై అయిదు.

'అయిదున్నరకల్లా అబిడ్స్ పోస్ట్ ఆఫీసు దగ్గర కొస్తాను, ఒకవేళ నువ్వు ముందొస్తే నాకోసం ఎదురుచూడు, నేను ముందొస్తే నీకోసం ఎదురు చూస్తూ నిలబడతాను. ఇద్దరం కల్సి అక్కడే దగ్గర్లో ఏదో హోటల్లో కాఫీతాగి, రామకృష్ణలో మొదట ఆట చూద్దాం!' అని తనే ప్రోగ్రామ్ ఫిక్స్‌చేసి మధ్యాహ్నం ఆఫీసుకి ఫోను చేశాడు రామచంద్ర రావు. తను సరిగ్గా అయిదున్నర కల్లా ఇక్కడ ప్రత్యక్షం! కానీ అరు కావస్తున్నా ఇంతవరకూ అంతూ పంతూ లేడు!

చిరాగ్గా వుంది.

నిరీక్షణ ఎంత శాపమో అర్థమవుతూంది.

ఉద్యోగరీత్యా హైద్రాబాద్ వచ్చి రెండు నెల్లు కావొస్తుంది. రామచంద్రరావు తప్ప పెద్ద చెప్పుకోతగ్గ స్నేహితులెవ్వరూ ఏర్పడలేదింకా.



అసలే అందరితోనూ అంత త్వరగా కల్సిపోయే తత్వం కాదు నాది. పైగా కొత్త వుద్యోగం, కొత్త వూరు!

రామచంద్రరావు, నేను బందర్లో డిగ్రీ చదివిన మూడేళ్ళు క్లాస్ మేటు, రూమ్ మేటు. మా ఇద్దరి మధ్యా వున్న బంధమును స్నేహమనే దానికి నిర్వచనంగా చెప్పుకోవచ్చు! ఉద్యోగం వచ్చిందన్న వార్తకన్నా, హైద్రాబాద్ వాస్తవ్యుడ్ని కాబోతున్నాను, మళ్ళీ రామచంద్రరావుతో స్నేహం - ఆ వూహే ఎంతో ఆనందాన్నిచ్చింది.

ఇక్కడికి రాంగానే సరాసరి వాడి రూమ్‌లోనే దిగాను...

'రాజూ! ఇక్కడున్నావేంటి?' పరిచయమైన గొంతు విన్పించడంతో ఆలోచనల్లోంచి తేరుకుని పక్కకి చూశాను.

ఆశ్చర్యం!

మృణాళిని!

అదే నవ్వు!

మనుషుల్ని ముగ్ధుల్ని చేసే అందం.

కవ్వించే ఆ కళ్ళలోనే వుంది గొప్ప ఆకర్షణ!

అప్పటికీ, ఇప్పటికీ, ఆమెలో ఏం మార్పులేదు. కాకపోతే వయ స్సుతోపాటు పరిపక్వాని కొచ్చిన చక్కని శరీర సౌష్ఠవం, ఆమె అందం మరింత విజృంభించేటట్లు చేసింది!

ఆమెనలా చూస్తుంటే మతిపోతుంది.

'ఏంటలా చూస్తున్నావ్! నన్ను గుర్తుపట్టలేదా?' ఆశ్చర్యంగా అడిగింది.

'అబ్బే! అదికాదు ... సడెన్‌గా నువ్విలా కన్పించేసరికి ఆశ్చర్యం వేసింది......' తడబడ్డాను.

'నే కాదు సడెన్‌గా దర్శనమిచ్చింది, నువ్వు! మా ఆయన ఇక్కడే ఇ,సి.ఐ.యల్.లో పనిజేస్తున్నారు. మా పెళ్ళై రెండేళ్ళు కావస్తోంది. ఈ రెండేళ్ళనించి ఇక్కడే మకాం- రాణీగంజ్‌లో వుంటున్నాం. అవునూ, నువ్విక్కడున్నావేంటి?'

'నేనూ ఇక్కడే వుంటున్నాను. ఆంధ్రా బ్యాంకులో వుద్యోగం. ఉద్యోగరీత్యా హైద్రాబాద్ చేరుకుని రెండునెల్లు కావస్తోంది. నల్లకుంటలో మరో మిత్రుడితో కల్సి ఓ రూమ్‌లో వుంటున్నాను.'

'—ఇదన్నమాట సంక్షిప్తంగా నీ గురించి' నవ్వింది.

ఆమె నవ్వుతూంటే మరింత ఆకర్షణీయంగా వుంటుంది. ఆమెనలా చూస్తుఉంటే సభ్యతని మర్చిపోతున్నాను!

'నువ్విప్పుడు నాతోపాటు మా ఇంటికి వస్తున్నావ్.' మృణాళిని మళ్ళీ నవ్వింది.

'వస్తాను, కానీ ఇప్పుడు కాదు.'

'మరెప్పుడు?!'

'రేపొచ్చే ఆదివారంనాడు వస్తాను. ఇప్పుడిక్కడో ఫ్రెండుకోసం వెయిట్ చేస్తున్నాను' అన్నాను.

గబగబా బాగ్‌లోంచి ఓ కాగితాన్ని తీసి అడ్రసు రాసిచ్చింది. అక్కడికెలా రావాలో వివరం చెప్పింది.

ఇంతలో ఆమె కావల్సిన బస్సు వచ్చింది.

"వస్తా రాజూ! నువ్వు రేపాదివారం తప్పకుండా రావాలి. నీకోసం ఎదురు చూస్తుంటాను హాటివ్వకు." చిన్నగా నవ్వి, బస్సువేపు కదిలింది.

'అలాగే' అని తలూపాను.

ఆమెక్కిన బస్సులోంచే దిగాడు రామచంద్రరావు.

బస్సు బయలుదేరింది.

బస్సు కిటికీలోంచి చేయి బయటికిపెట్టి వస్తానన్నట్లు చేయూపింది మృణాళిని.

అప్రయత్నంగా నేనూ చెయ్యూపాను.

దాదాపు ఆరేళ్ళ తర్వాత మృణాళిని అలా మెరుపుతీగలా కన్పించి మాయమయ్యేసరికి మనస్సు కాస్త కంగు తిన్నదనే చెప్పాలి.

'సారీ బ్రదర్! అనుకోకుండా లేటైపోయింది. పద పద, లేటైపోయింది.' ఇద్దరం గబగబా హాలుకి చేరుకున్నాము.

సినిమాలో హీరోయిన్ చాలా బావుంది. ఆమెని చూస్తుంటే మృణాళినే గుర్తుకొస్తోంది! హాల్లో కూర్చున్నానన్న మాటేగాని ధ్యాసంతా మృణాళిని మీదే వుంది.

దాదాపు నాల్గు సంవత్సరాలు ఇద్దరం కల్సి చదువుకున్నాం. ఇద్దరి ఇళ్ళూకూడా పక్కపక్కనే కావడంతో మా పరిచయం మరింత పెరిగింది. స్కూలుకి కల్సి వెళ్ళేవాళ్ళం. స్కూలు నించి కల్సి వచ్చేవాళ్ళం.

క్లాస్‌లో ఏ సబ్జక్టు చూసినా ఆమె ఫస్ట్! అది ఆమెకన్నా నా కెక్కువ గర్వాన్ని కల్గించేది! నేను స్కూల్ ఫైనల్ పాసయ్యానంటే కారణం ఆమే!

ఆమెకూ్కడా అప్పట్లో నేనంటే ఎంతో అభిమానముండేది. ఆ విషయం ఆమె ప్రతిచేష్టలోనూ కొట్టొచ్చినట్లు కనిపిస్తూండేది.

ఆమె ముఖంలో అమాయకతుంది. అందుకే ఆమెని చూస్తూంటే ఒక విధమైన అనుభూతి కల్గుతుండేది. ఆమెని దగ్గరకి తీసుకోవాలని, ఏమేమో చేయాలని అన్పించేది...

ఆరోజు నాకింకా బాగా గుర్తుంది-

తలంటి స్నానంచేసి, కొత్తబట్టలు వేసుకున్నాను. ప్రతి సంవత్సరం పుట్టినరోజునాడు ఇలా తయారవడం నాకు మామూలే.

అమ్మ చేసిన మైసూర్‌పాక్ కేక్స్ తీసుకుని మృణాళిని వాళ్ళింటికి బయల్దేరాను.

నేను వెళ్ళేసరికి మృణాళిని హాల్లో సోఫాలో కూర్చుని ఏదో వీక్లీ తిరగేస్తోంది. ఇంట్లో ఇంకా ఎవ్వరు వున్నట్టు లేరు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

'రా రాజూ! అక్కడే నిలబడిపోయావేం? నీ కోసమే ఎదురు చూస్తున్నాను. నువ్వురాకపోతే నేనే మీ యింటికి వద్దామనుకుంటున్నాను.' చేతిలోవున్న వీక్లీని ఎదురుగా వున్న టీపాయ్‌మీద పడేస్తూ అంది మృణాళిని.

'ఇంట్లో ఎవ్వరూ లేరేంటి?'

'కన్పించడంలా - ఎదురుగా ఇంత మనిషుంటే!'

'నువ్వు సర్లే! మీ అమ్మ, నాన్నగారు, తమ్ముడూ ఎవరూ లేరా?'

'వాళ్ళంతా ఇంతకుముందే బిర్లా టెంపుల్‌కెళ్ళారు.'

'మరి నువ్వెళ్ళలేదే?'

'నచ్చూ రమ్మన్నారు. నిన్నే నేను, శకుంతల, గీత కల్సి వెళ్ళాం. అందుకనే ఇవాళ రానన్నాను.'

'ఒక్కదానివే ఇలా కూర్చోడానికి బోరు కొట్టడంలా?'

'కాలక్షేపానికి నువ్వొచ్చావుగా' నవ్వింది.

అసలే ఆమె అందం, వంటరితనం నన్ను పిచ్చివాడ్ని చేస్తోంది. పైగా నవ్వు!

నవ్వుతూంటే ఆమె అందం మరింత విజృంభిస్తుంది! బలవంతాన నాలోని విపరీత భావాల్నణచుకొంటూ ఆమె పక్కనే సోఫాలో కూలబడ్డాను.

'ఏంటీవాళ లైట్ కొడుతున్నావ్?' మళ్ళీ నవ్వింది.

ఆమె అందం నాలో ఎంత సంచలనాన్ని కల్గిస్తోందో, నా అందం ఆమెలో అంతే సంచలనాన్ని కల్గిస్తోందన్న విషయాన్ని నేనంతవరకూ పసిగట్టలేకపోయాను. అప్పుడే కొద్దికొద్దిగా అర్థమవుతోంది.

'ఇవాళ నేను పదిహేనో సంవత్సరంలో అడుగుపెట్టాను.' నేనూ నవ్వాను.

'అంటే ఇవాళ తమరి పుట్టినరోజన్నమాట. అందుకే ఇలా ట్రిమ్‌గా తయారై బయల్దేరారన్నమాట!'

'అన్నమాటేంటి వున్నమాటే అది.'

'నీకో పుట్టినరోజు కానుకివ్వనా?'

'కానుకిస్తానంటే వద్దని ఎందుకు అంటాను.'

'నిన్నిలా చూస్తుంటే ఏమనిపిస్తోందో తెల్సా? చటుక్కున దగ్గరకు లాక్కుని ముద్దుల్తో ముంచెత్తేయా లనిపిస్తోంది.' నావేపుకి జరుగుతూ అంది.

నే నింతకుముందెన్నోసార్లు ఆమెను దగ్గరకు తీసుకోవాలను కున్నాను. చేయిలేకపోయాను. ఇవాళ తనంతట తాను చొరవ తీసుకున్నా భయంగానే వుంది!

అమ్మో! ఈ విషయం మా యింట్లోకాని, వాళ్ళింట్లోకాని తెలిస్తే? రెండిళ్ళ మధ్యా రాకపోకలు బందైపోతాయ్. ఆ తర్వాత మృణాళిన్ని చూడకుండాను, మాట్లాడకుండాను కట్టుదిట్టాలు పెరిగిపోతాయ్. ఆమెని చూడకుండా, ఆమెతో మాట్లాడకుండా నేనుండలేను! ఈ క్షణిక సుఖం కోసం శాశ్వతంగా ఆమెను దూరం చేసుకోలేను.

'ఏమిట్రాజూ ఆలోచిస్తున్నావ్? నేనన్నది వినబళ్లేదా?' మరింత దగ్గరగా జరిగింది. దాదాపు నన్ను తాకుతూనే కూర్చుంది. ఆమె అంత

దగ్గర కొస్తే నాలో ఎంత అణచుకోవాలని ప్రయత్నిస్తున్నా ఓ విధమైన చలనం కలగసాగింది. అయినా నాలో వున్న భయం ఆ చలనాన్ని నొక్కిపట్టేస్తుంది. నే నేమాత్రం చొరవ తీసుకున్నా మృణాళిని సర్వస్వాన్ని దోచుకోవచ్చు. కానీ నావల్లకాదు!

'నీకేమన్నా పిచ్చిపట్టిందా ఏంటి?' సోఫాలోంచి లేచి, నించున్నాను.

'నన్నర్థం చేసుకో రాజూ! నువ్వంటే నాకెంతో అభిమానం. ఆ అభిమానానికి చిహ్నంగా చిన్న అనుభూతి. అంతే నే కోరింది.' తనూ లేచి నించుంది.

'ఇవ్వాళ నువ్వేం మాట్లాడుతున్నావో నీకేం అర్థం కావడం లేదు. మనం క్షణికమైన ఆనందం కోసం ఇప్పుడేం తప్పుచేసినా, దాని తాలూకు మచ్చ జీవితాంతం మాసిపోదు గిల్టీ భావం మన మనస్సులో పేరుకు పోతుంది. ఆ తర్వాత మనమింత స్వేచ్ఛగా ఇలా తిరగలేం, మాట్లాడుకోలేం. నువ్వే ఆలోచించు. నేను మళ్ళీ కాసేపుండి వస్తాను.' చేతిలో వున్న స్వీట్స్ ఆమె చేతిలో పెట్టి, పిలుస్తున్నా వినిపించుకోకుండా గబ గబా వచ్చేశాను.

మనసంతా చికాగ్గా వుంది.

కాసేపా పుస్తకం, ఈ పుస్తకం తిరగేసి తిరిగి మృణాళినీ వాళ్ళింటికి బయల్దేరాను.

మృణాళిని వాళ్ళ అమ్మ, నాన్నగారు వాళ్ళు అప్పుడే గుడినించి వచ్చినట్లున్నారు. నన్ను చూడగానే కూర్చోమని ప్రసాదం పెట్టారు. అప్పుడు తెల్సింది మృణాళిని నాన్నగార్కి హైద్రాబాద్ నించి ట్రాన్స్‌ఫరైందని!

పెద్ద షాక్ తగిలినట్లనిపించింది.

అంతే... అంతే...

మృణాళిని తనకి దూరంగా వెళ్ళిపోతుంది. మళ్ళీ కన్పించక పోవచ్చు... ఈ మాటలనుకుంటేనే మనసు దేవినట్లవుతోంది. బలవంతాన రాబోతున్న కళ్ళనీళ్ళ నాపుకున్నాను.

అందుకే కాబోలు మృణాళిని ఇందాకలా ప్రవర్తించింది? దూరమై పోతున్నామన్న బాధతో అలా అనుంటుంది.

మృణాళిని నాకు దూరంగా వెళ్ళిపోతుంది! మళ్ళీ నాకు కన్పించదు. ఇకముందు మృణాళినెవరో, నేనెవరో! ఈ ఆలోచనల్ని భరించలేక పోయాను.

మళ్ళీ వస్తానంటూ గబగబా ఇంటికొచ్చేసి, అలాగే మంచంమ్మీద పడుకున్నాను. ఆ రోజెవ్వరితోనూ మాట్లాడబుద్ధిపుట్టలేదు.

వెళ్ళిపోయేటప్పుడు మృణాళిని చూసిన ఆ చూపు నాకిప్పటికీ బాగా గుర్తుంది. ఆ చూపులో ఎంత బాధ, వేదన!

ఆ తర్వాత కొన్నాళ్ళు మా ఇద్దరిమధ్యా వుత్తరాలు నడిచాయి. వున్నట్టుండి వుత్తరాలుకూడా ఆగిపోయాయి.

తిరిగి మళ్ళీ ఇన్నాళ్ళకి ఇలా కన్పించింది.

అప్పటికీ, ఇప్పటికీ ఆమెలో శారీరకంగా తప్ప మరే మార్పులేదు. నేనంటే తనకున్న అభిమానం, ఆరాధన ఇంకా అలాగే వున్నాయ్. నన్ను చూడగానే ఆమె కళ్ళలో మెరిసిన మెరుపే దానికి తార్కాణం.

మానసికంగా మగవాడికన్నా ఆడవాళ్ళే ముందు పెరిగిపోతారన్న మాట వాస్తవం! ఆరోజున ఆమె అడిగినా నేనే దూరంగా వుంచాను. కాని ఇప్పుడు...ఇప్పుడు...నో...ఆమెని దూరంగా నెట్టివేయలేను. మతి పోగొట్టే ఆ అందాన్ని అనుభవించి తీరుతాను.

'ఒరేయ్! సిన్మా చూస్తున్నావా? నిద్రపోతున్నావా?' భుజం పట్టుకుని కదిలించాడు రామచంద్రరావు.

'అబ్బే! చూస్తూనే వున్నాను...' మనసుని బలవంతాన మృణాళిని వేపునించి మరల్చాను.

ఆ రాత్రల్లా కూడా సరిగా నిద్రపట్టలేదు. మృణాళిని గురించి ఆలోచిస్తూ ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలీదు!

మర్నాడాఫీసునించి సరాసరి మృణాళిని ఇంటికి బయల్దేరాను.

నేనెళ్ళేసరికి హాల్లో పడక్కుర్చీలో పడుకుని ఏదో వారపత్రిక తిరగేస్తోంది.

'అరే! ఇంత తొందరగా దయ కల్గిందే మా మీద!' నన్ను చూడగానే నవ్వుతూ కుర్చీలోంచి లేచింది.

'ఏమిటీ అలా నిలబడిపోయావ్! ఇలా వచ్చికూర్చో.' తన కుర్చీలో తిరిగి కూర్చుంటూ మరో కుర్చీ చూపిస్తూ అంది.

కూర్చున్నాను మాట్లాడకుండా.

'ప్రతి గురువారం మౌనవ్రతం పాటిస్తావేంటి?'

'అబ్బే! అదేంకాదు...వయసుతోపాటు పెరిగిన నీ అందం చూస్తుంటే మతిపోతోంది.' ధైర్యంగా అనేశాను.

'అబ్బో ఫర్లేదు! అబ్బాయిగారికీమధ్య ధైర్యంకూడా వచ్చేసినట్లుందే!' చిన్నగా నవ్వింది.

అంటే...ఆమె అప్పటి నా ప్రవర్తన్ని ఇంకా మర్చిపోలేదన్న మాట! అవున్లే ఎలా మర్చిపోతుంది?

'ఎప్పుడూ అలాగే వుంటామా? వయసుతోపాటు పెరగమూ!' అవునూ- మీ ఆయనింకా రాలేదా?' ఆయ నెప్పుడొస్తాడో తెల్సుకోవడం ముందవసరం. అందుకే ఆ ప్రశ్నడిగాను.

'ఆయనొచ్చేసరికి ఆరు దాటుతుంది. ఓ అరగంట ఓపిక పట్టు. ఆయన్ని చూడొచ్చు.'

అరగంట కాదుకదా అయిదు నిముషాలు కూడా ఓపికపట్టలేను. నేనాయన్ని చూట్టానికి రాలేదిక్కడికి. నాకోసం ఎదురు తెన్నులు చూసే అందాన్ని అందుకుని అనుభవించడానికి వచ్చాను. అలస్యం అమృతమ్ విషమ్.. లేవబోయాను.

'వన్ మినిట్ ఇప్పుడే కాఫీ తీసుకొస్తాను.' మృణాళిని లోపలి కెళ్ళింది.

ఆమెతోపాటే వంటింట్లో కెళ్ళాను.

'ఆ! ఇంకా ఏంటీ సంగతులు?' ఫ్లాస్కందుకుంటూ అడిగింది.

'ఏమున్నాయ్?' అంతా మామూలే' ఇది మాటలకి సమయం కాదు. ఒక్కొక్క క్షణం ఎంతో అమూల్యమైంది. మనసు తొందరపడుతోంది.

'నిజంగా నిన్ను నా జన్మలో మర్చిపోలేను రాజూ!' కాఫీని రెండు గ్లాసుల్లో పోసి ఒకటి నా కందిస్తూ అందామె. 'నిన్నూ ఇకముందు నేను మర్చిపోలేను మృణాళినీ! ఇన్నాళ్ళ నా నిర్లక్ష్యానికెంతో బాధపడు తున్నాను!' నాలో నేనే అనుకున్నాను.

'అంతవరకూ నీకన్నా నేనెంతో తెలిసిందాన్నని గర్వపడుతుండే దాన్ని! ఆ రోజు నీ ప్రవర్తన చూసింతర్వాత నా గర్వమంతా అణిగి పోయింది. నువ్వా రోజు ఏమాత్రం అవకాశం తీసుకున్నా నా జీవితం సర్వనాశనమైపోయేది. నీ మాటలో ఎంతో సత్యముంది. ఆ రోజు మనం తొందరపడుతుంటే ఇవాళింత సుఖంగా ఇలా మాట్లాడుకోగల్గి వుండే వాళ్ళంకాదు. గిల్టీకాన్షస్‌తో నిన్ను చూసినా నేను తప్పించుకుని వెళ్ళిపోయే దాన్నేమో! నిన్న నిన్నక్కడ చూడగానే నాకెంత ఆనందంగా అన్పించిందో

తెల్సా? వర్ణించలేను. నీలాంటి మంచి మనిషిని స్నేహితుడిగా పొందినందుకు నేనెంతో గర్వపడుతున్నాను.' ఆమె కళ్ళలో ఓ విధమైన గర్వం తొణికిసలాడుతోంది.

ఆ కళ్ళలోకి చూడలేకపోయాను.

ఎక్కడికో పాతాళంలోకి దిగబడిపోతున్నట్లనిపించసాగింది. నాలోని పిశాచం సిగ్గుతోటి ఎగిరిపోయింది. ఆమె ముఖంలోకి చూడాలంటేనే సిగ్గేస్తోంది! తను మంచి మనిషి! అసలు తనే వుద్దేశంతో ఇక్కడికొచ్చాడు? ఆవిడ మంచితనాన్ని ఎంత అసహ్యంగా అర్థం చేసుకున్నాడు! అలాంటి మూర్ఖుడిలో కూడా మంచి మనిషినే చూసి, ఆ మనిషిలోని మూర్ఖత్వాన్ని పారద్రోలిన మంచి మనిషి తను!

'నువ్వు కాదు, నీలాంటి మంచి మనుషుల స్నేహానికి నోచుకున్న నేను గర్వపడాలి. వస్తా మృణాళినీ!' కాఫీ గ్లాసు కిందపెట్టి బయల్దేరాను.

'అదేంటి! ఆయనొచ్చేదాక వుండవా? నీ గురించి ఆయనకెంతో గొప్పగా చెప్పాను. నువ్వొచ్చి కనబడకుండా వెళ్ళావని తెలిస్తే బాధపడతారు.'

'ఇవాళ ఆరు గంటలకో మనిషిని సికింద్రాబాద్ స్టేషన్ దగ్గర కల్సుకోవాలి. పోతూ పోతూ దార్లో ఇలా వచ్చాను. మళ్ళా ఆదివారం నాడు వస్తాను.' గబగబా బయట కొచ్చేశాను. ఈ మూడ్రోజుల్లో నైనా నాలో వున్న నీచ భావాల్ని బయటికి తరిమేయడానికి ప్రయత్నించాలి! *

(స్నేహ మాసపత్రిక-ఫిబ్రవరి 1978)

# చీకటి నీడలు

కిటికీ దగ్గర నిలబడి ఇనుపచువ్వల మధ్యనించీ బయటికి చూస్తోంది అమృతం.

ఆమె చూపులన్నీ అతనిమీదే వున్నాయ్!

అతని ఎడమచేతిలో ఏదో పుస్తకంవుంది. కుడిచేత్తో అక్కడనేవున్న భూమిలో పాతిన ఇనుప కడ్డీని పట్టుకున్నాడు.

ఆ బస్సు షల్టర్‌కిందే అతనికి కొద్దిగా అవతలగా మరో ముగ్గురు మనుషులు కూడా నిలబడున్నారు. కానీ అమృతం దృష్టి వాళ్ళెవ్వరివేపూ ప్రసరించడం లేదు. వాళ్ళక్కడ నిల్చున్నారనే ధ్యాస కూడా ఆమెకు లేదు.

అతను అమృతం చూపుల్లో చిక్కుకు పోయాడు. ఆమె అతన్ని తన ఆలోచనల్తో బంధించి వేసింది. తనకి కొంచెం దూరంగావున్న ఆ ఇంటి కిటికీ వెనుకనించీ ఓ జత కన్నులు తననే చూసి పరవసించిపోతున్నాయని అతనికి తెలీదు. ఊహించలేదుకూడా!

అతన్నే చూస్తున్న అమృతం కనుల నిండుగా వెలుగుపూలు ఎన్నో వేల కాంతి నక్షత్రాలు...

మెల్లిమెల్లిగా చీకటి పడబోతోంది. రోడ్డు కిరువైపులా వున్న దీపాలన్నీ వెలిగాయ్. రోడ్డుమీద వుండివుండి కార్లు, రిక్షాలు దూసుకు వెళ్తున్నాయ్

ఇవేవీ అమృతానికి పట్టడం లేదు.

ఆమె కనులలో, ఆలోచనలతో అతనే నిండి వున్నాడు!

అతని చూస్తేచాలు తన గుండెలు ఆనందంతో స్పందిస్తాయ్. ఏదో తెలీని పరవశం, చెప్పలేని ఆనందం కలుగుతాయ్.

నాల్గు రోజుల్నించీ అతడ్ని తను చూస్తూనే వుంది. ఎన్నిసార్లు చూసినా ఇంకా చూడాలనే తపన...ఆరాటం. తీరని కోరిక...!

అతనంటే ఎందుకో తనకంత ఇష్టం? ఎన్నోసార్లు ప్రశ్నించుకుంది తనను తాను.

జవాబు లేదు.

అతనెవరో తనకి తెలీనుకూడా తెలీదు.

సరిగ్గా నాలుగురోజుల క్రితం ఓ రోజు సాయంత్రం చీకటి పడ డానికి ముందు మామూలుగా అలంకరించుకుని పువ్వులా ఇంటి బయట నిలబడింది తను.

అప్పుడే అతడ్ని మొదటిసారిగా చూసింది. రోడ్డు చివర్నించీ మెల్లిగా ఠీవీగా నడిచివస్తూ కనిపించాడు.

ఆ క్షణంలోనే తన గుండెలదిరాయ్. అవి అలా ఎందుకదిరాయో కూడా తనకి తెలీదు. అతడ్ని ఎక్కడో, ఎప్పుడో, ఏ జన్మలోనో కలుసుకున్న భావన!...

అతను దగ్గరవుతున్న కొద్దీ తన గుండెల అలజడి పెరగసాగింది.

తెల్లని పాంటు, తెల్లని షర్టు వేసుకుని మల్లెపువ్వులా వున్నాడతను!

కుడిచేతి వాచీ, విశాలమైన నుదురు, వత్తయిన జుట్టు, చిలిపి చూపులు అతని అందాన్ని మరింత విజృంభింప జేస్తున్నాయ్

అతని అందానికి చలించిపోతూ రెండడుగులు వెనక్కివేసింది తను.

సరిగ్గా అదే సమయానికి అతను ఇంటిముందు కొచ్చాడు.

తనని దాటివెళ్తూ ఒక్కసారి తల పైకెత్తి తనవంక చూశాడు.

వెంటనే తనకి ఏదో తెలీని సిగ్గు నిలువునా క్రమ్మేసింది... కలవరపడిపోయింది... తల వంచుకుంది...

అతను వెళ్ళిపోయాడు...

అతన్నే చూస్తూ అక్కడే నిలబడిపోయింది తను. ఒక్కసారి అతను వెనక్కి తిరిగి చూస్తే బావుండుననిపించింది తనకి. కానీ అతనలా చూడలేదు. రోడ్డు మలుపు తిరిగాడు.

అతను వెళ్ళిపోయినా అతని చూపులే తనని వెంటాడసాగాయ్! ఆ చూపుల కోసం తనేమైనా చేయగల్దు !

తనకా చూపులు కావాలి, అంతే!

అప్పట్నుంచీ రోజూ సాయంత్రం అదే వేళకి అతనటుగా వస్తూనే వున్నాడు. తనేపన్లో వున్నాసరే. ఆ సమయానికి బయటికొచ్చి అతనికి తెలీకుండా అతన్ని గమనిస్తూనే వుంది.

ఏదో ఆలోచిస్తూ వస్తూంటాడు.

సరిగ్గా ఇంటిముందుకు రాగానే ఓసారి తలెత్తి చూస్తాడు. అవే చూపులు ! వాటిలో మార్పుండదు. ఆ చూపులని చూడగానే తనలో తత్తరపాటు ప్రారంభమవుతుంది. వెనక్కి పారిపోవా లనిపిస్తుంది. కానీ వెళ్ళలేదు. అతన్నే గమనిస్తూ అక్కడే నిలబడుతుంది.

అతను సరాసరి కొద్దిగా అవతలగా వున్న బస్టాప్ దగ్గరకెళ్ళి షెల్టరుక్రింద నిలబడతాడు. వెంటనే తను తలుపులేసి లోపలకెళ్ళి కిటికీ దగ్గర నిలబడుతుంది.

అక్కడ్నించీ చూస్తే అతను మరింత బాగా కనబడతాడు. అతనే కాదు - మరెవ్వరు కూడా తనని గమనించడానికి వీలుండదు. అందుకే అక్కడికి వెళ్ళి నిలబడుతుంది తను.

బస్సు రావడం ఆలస్యమయితే మొహంలో విసుగు కనబరుస్తూ, నిముష నిముషానికి వాచీ చూసుకుంటూ నిలబడతాడతను. అక్కడ నిలబడుతున్నంతసేపూ ఆ ఇనుపకడ్డీని కుడిచేత్తో పట్టుకునే వుంటాడు.

తను మాత్రం అతని బస్సు మరింత ఆలస్యంగా రావాలని కోరుకుంటూ కిటికీ దగ్గర నిలబడుతుంది. తను అలా అనుకోవడమే ఆలస్యం-బస్సు వచ్చేస్తుంది... అతను ఎక్కేస్తాడు!

నాల్గురోజుల్నుంచీ జరుగుతున్న తంతే ఇది!

ఇప్పుడూ అంతే... అతన్నే చూస్తూ బస్సు రావడం మరికొంత ఆలస్యమైతే బావుండునని అనుకోసాగింది.

అతనక్కడ ఇబ్బందిగా కదలసాగాడు. కడ్డీని వదలి కుడిచేతిని నడుముకి ఆన్చి ఒకవైపుకి కొద్దిగా ఒదిగి నిలబడ్డాడు.

జాలేసింది తనకి.

కానీ ఏంచేయగలదు ?

అందుకే అలా చూస్తూ నిలబడిపోయింది.

బస్సు షెల్టర్‌కు కొంచెం దూరంలో వున్న వీధి దీపం వెలుతురును విరజిమ్ముతోంది. ఆ వెలుతురులో అతని నీడ పొడుగ్గా సాగింది.

పాంటు జేబులోనించి సిగిరెట్టు పాకెట్ తీసి, ఓ సిగిరెట్టు వెల్గించాడు.

ఎంత అందంగా సిగిరెట్ కాలుస్తున్నాడు! తను చీకట్లో నిలుచున్నానన్న సంగతికూడా మరచిపోయి పరవశించిపోతూ అతన్నే చూడసాగింది అమృతం.

ఇంతలో బస్సు రావడంతో సిగిరెట్‌ని పారేసి గబగబా అటు కదిలాడు అతను.

కంటిముందున్న అందమైన కలని చెరిపేసినందుకు బస్సుమీద విపరీతమైన కోపం వచ్చింది అమృతంకి.

'వెధవబస్సు!' మనస్సులోనే తిట్టుకొంది.

బస్సు వెళ్ళిపోవడంతో నీరసంగా నిట్టూరుస్తూ వెనక్కి తిరిగింది. అప్పుడుగాని ఆమె గమనించలేదు, తనంతవరకూ చీకట్లోనే నుంచున్నా నన్న సంగతి!

దీపం వెలిగించింది. ఇంటినిండా వెలుతురు.

మళ్ళీ రేపు సాయంత్రంవరకూ అతను కనిపించడు. అమృతం మనసు దిగులుతో నిండిపోయింది.

బయట తలుపుమీద ఎవరో తడుతున్న శబ్దానికి అటు కదిలింది.

పాసింజరేమో! - ముఖాన పట్టిన చెమటని పైటతో తుడుచుకుని, జుట్టుని చేత్తోనే సవరించుకుని తలుపు తీసింది.

ఎదురుగా సామ్రాజ్యం!

"ఏంటి! పాసింజెర్లొచ్చే ఈ టైమ్‌లో తలుపులేసుకున్నావ్...? కొంపదీసి లోపల ఎవరూ లేరుకదా?" గారపట్టిన పళ్ళని బయటికిపెట్టి నవ్వుతూ అంది సామ్రాజ్యం.

సామ్రాజ్యం మాటలు వినగానే వళ్ళు మండిపోయింది అమృతానికి. బలవంతాన కోపాన్నణచుకుంటూ "వంట్లో బాగుండకపోతేను పడు కున్నాను..." అంది నెమ్మదిగా.

"వంట్లో బాగుండలేదని తొంగుంటే గడిచే జీవితాలా మనవి! బాగుండకపోతే పగలు పడుకోవాలి...అద్సరేగాని అతనెవరో వచ్చాడు రూముకంట వెళ్తావా?" అడిగింది సామ్రాజ్యం.

వెళ్ళనన్నట్లు తలూపింది అమృతం.

"ఇరవై ఇస్తారంట. అనవసరంగా వదులుకోవడమెందుకు? వెళ్ళు. ఇవాళ్ళింత వరకూ నీకు బోణీ అయినట్టేలేదు. అందుకే నీ దగ్గరకి వచ్చాను." అమృతంపై విపరీతమైన జాలి వలకపోసింది.

"వెళ్ళను, స్టూడెంట్ కుర్రోళ్ళను నమ్మకూడదు. ముందు ఇద్దరమే నంటారు. తీరా వెళ్ళింతర్వాత పదిమందికిపైనే ఎగబడతారు." తన పాత జ్ఞాపకాన్ని నెమరువేసుకుంటూ నీరసంగా అంది అమృతం.

"సరే అయితే...కనకం వెళ్తుందేమో కనుక్కుంటాను. నేనివాళ మరోచోటికి వెళ్తున్నాను. లేకపోతే నేనే వెళ్ళేదాన్ని." గబగబా వెళ్ళిపోయింది సామ్రాజ్యం.

ఝోరున వర్షం కురిసి వెలిసినట్లనిపించింది అమృతానికి.

తలుపులను మూసి, దీపాన్ని తగ్గించి మంచంమీద వాలిపోయింది.

మళ్ళీ మనసులో అతను మెదిలాడు.

అతని చిలిపిచూపు గుర్తుకొచ్చింది.

వెంటనే అతని చుట్టూ ఆమె తన ఆలోచనలని అల్లుకోసాగింది.

మంగళవాద్యాలు మ్రోగుతున్నాయ్. రంగు రంగుల దీపాలతో వెలిగిపోతోంది కళ్యాణమంటపం.

పెళ్ళికూతురుగా తను...

తన పక్కనే పెళ్ళికొడుకుగా అతను!

తను సిగ్గుతో తలవంచుక్కూర్చుంది.

అతను లేచాడు.

ఎవరో తన జడను పైకెత్తి పట్టుకున్నారు. అతని చేతుల్లో మెరిసిన మంగళసూత్రం తన మెడ నలంకరించింది. మంగళవాద్యాల మోత పెరిగిపోయింది. అక్షింతల జల్లు...దీవెనలు...

అతనిప్పుడు తన భర్త!

ఇకముందు అతని ఇష్టాలే తన ఇష్టాలు, తన ఇష్టాలే అతని ఇష్టాలు! ఇద్దరూ చెరి సగం. ఇప్పుడా రెండు సగాలు కలిసి ఒకటయ్యాయి. తన జీవితానికి పరిపూర్ణత చేకూరింది.

పెళ్ళి తతంగాలన్నీ పూర్తయి ఇద్దరికీ పూర్తి ఏకాంతం దొరకడానికి దాదాపు వారంరోజులు పట్టింది.

ఇప్పుడిద్దరికీ కావలసినంత ఏకాంతం!

అతనాఫీసునించీ వచ్చేసరికి తను ట్రిమ్‌గా తయారై రెడీగా వుంది.

ఇద్దరూ ఒకే కప్పులోని కాఫీని సగం... సగం... తాగారు.

తను కప్పుకడిగి వచ్చేలోపు అతను రెడీ అయ్యాడు. ఇద్దరూ కలిసి బయటికి బయల్దేరారు కబుర్లు చెప్పుకుంటూ.

ఏ వీధిలో అయితే అతను పోతూంటే తను విపరీతమైన వ్యామోహంతో చూసేదో ఆ వీధిగుండానే అతన్తో కలిసి తను వెళ్తోందిప్పుడు! 'ఆ వీధిలో వాళ్ళెంతమంది తమని ఈర్ష్యగా చూస్తున్నారో!' తన మనసానందంతో నిండిపోయింది.

ఇద్దరూ బస్టాప్‌లోని షెల్టర్ కిందకి చేరుకున్నారు. అలవాటుగా అతను కుడిచేత్తో ఇనుపకడ్డీని పట్టుకుని నిలబడ్డాడు.

అతనలా నిలబడితే తనింతకు ముందు దూరాన్నించీ చూసి ఆనందించేది. ఇప్పుడు తనతని పక్కనే నిలబడుంది. అతనిప్పుడెవరో కాదు - తన భర్త! అతన్లో అర్ధభాగం తను...

హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చి తనిదివరకు నిలబడి చూసే కిటికీ వేపు చూసింది.

ఆ చీకటిలో రెండు కళ్ళు తళుక్కున మెరిశాయ్!

ఎవరో తమని గమనిస్తున్నారు...

తమని కాదు అతన్ని...!

ఇక అక్కడ నిలబడలేక అతని చేయి పుచ్చుకుని గబగబా అక్కడ్నించీ బయల్దేరింది తను.

తను...తన ప్రక్కన అతను...

ఎక్కడెక్కడికో వెళ్ళిపోతున్నారు- పచ్చని చెట్ల మధ్యనించీ, తెల్లటి నీటి ప్రవాహాల పక్కనించీ.

నడుస్తూంటే ఇద్దరి భుజాలు రాసుకుంటున్నాయ్, అతను తనకేదో చెప్తున్నాడు. తను వింటోంది. మధ్య మధ్య తను నవ్వుతోంది. తను నవ్వినప్పుడల్లా అతను తన చేతివేళ్ళను మృదువుగా నొక్కుతున్నాడు.

పచ్చని చెట్లు...రకరకాల పువ్వులూ, పండ్లూ...చెప్పలేని వెలుతురు. రంగురంగుల పక్షులు...రివ్వనవీచే గాలి...పరుగులుతీసే సెలయేరూ దాటుకుంటూ ఓ చోట ఆగిపోయాడతను. తనూ ఆగింది.

ఎదురుగా నీటిఒడ్డున ఓ పొదరిల్లు. చుట్టూ ఎన్నో పూలచెట్లు. అదే తమ ఇల్లని చెప్పాడతను. తను మురిసిపోయింది.

ఇద్దరూ ఆ పొదరింటిముందు గుబురుగా వున్న చెట్లమధ్య కూర్చున్నారు.

తన ఒడిలో అతను...

అలా ఎంతోసేపు... కాలం తెలీదు. వెన్నెలొచ్చింది. చంద్రుడి కాంతిలో అతని కళ్ళు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయి. అతని కళ్ళల్లో కళ్ళుపెట్టి చూసింది.

అతని కళ్ళల్లో తన రూపమే!

కళ్ళలోనే కాదు-హృదయంలోకూడా తనరూపమే వుండివుంటుంది!

తన నడుంమీద చెయ్యివేసి ముందుకు లాక్కున్నాడతను. చటుక్కున అతనిమీద వాలిపోయింది తను!

అతని ముఖంమీద తన ముఖం!

సున్నితంగా తన పెదాలమీద ముద్దు పెట్టుకున్నాడు. తన వంట్లోకి విద్యుత్ ప్రవహించినట్టయింది. గుండెలో గంటలు మ్రోగాయి. వెంటనే అతను తన గుండెలో మరింతగా ఇమిడిపోయాడు. అతని చేతులు తనని పూర్తిగా చుట్టేశాయి. తనని తను మరచిపోసాగింది.

రకరకాల మధురమైన ఆలోచనల్తో అమృతానికి నిద్ర కరువైంది. అతని సరసన తనని వూహించుకుని, ఏవేవో లోకాల్లోనో విహరించసాగింది.

అమృతం దృష్టిలో అతను ఎంతో వున్నతుడు. మరో హిమాలయం. తనకి మరో జన్మంటూ వుంటే అతనే భర్తగా కావాలి...

—రాత్రి ఒంటిగంట కావస్తోంది. అయినా అతని ఆలోచనల్తో అమృతానికి నిద్రపట్టడం లేదు.

మంచం మీదనుంచి లేచింది.

తలుపు తీసుకుని బయటికి వచ్చింది.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఇళ్ళన్నీ నిద్రపోతున్నట్టున్నాయి. వాటికి కాపలా కాస్తున్నట్లుగా వెలుగుతోంది వీధి దీపం!

నెమ్మదిగా ఆమె బస్సు షెల్టర్ దగ్గరికి నడిచింది.

సరాసరి అతను నిలబడే చోటుకి వెళ్ళింది. అతను పట్టుకున్నట్టే కుడిచేత్తో ఇనుపకడ్డీని పట్టుకుని నిలబడింది.

ఆమె మనసునిండా అతనే నిండి వున్నాడు.

అతను రోజూ ఇదే కడ్డీని పట్టుకుని ఇక్కడే నిలబడతాడు. తనిప్పుడు అతను పట్టుకున్న కడ్డీనే అక్కడే పట్టుకుంది. అక్కడే నిల్చొంది.

రేపు అతనొస్తాడు. తను నిలబడ్డచోటనే ఇక్కడే నిలబడతాడు. ఈ కడ్డీనే తను పట్టుకున్నచోటనే పట్టుకుంటాడు.

అమృతానికి ఎంతో సంతోషమైంది. ఆ కడ్డీనలా పట్టుకుని ఎంత సేపలా నిల్చుండిపోయిందో ఆమెకే తెలీదు.

"ఏం, ఇంతవరకూ వచ్చిన బుకింగ్‌లు చాలలేదా-ఇంకా ఇక్కడ నిలబడున్నావ్..." ఉలిక్కిపడింది అమృతం. ఎదురుగా బీట్ కానిస్టేబుల్! ఆమె గుండెల్లో రాయిపడింది.

"అబ్బే... ఏంలేదు..." తత్తరపడింది.

"ఇవాళయినా నా మామూలిస్తావా?" గద్దించాడు. ఆ మాటలతో ఆమె చలించిపోయింది.

తను తింటానికే లేనప్పుడు ఇతని కెక్కడ్నించి తెచ్చిస్తుంది?

అదే మాట అతన్తో అంది.

"సరిసరి... ఎప్పుడూ వుండేవేగా ఈ ఆకలి ఏడుపులు. పద... పద..." అదిలించాడు.

ఆమె...

ఆమె వెనుకే అతనూ ఇంట్లోకి అడుగుపెట్టారు. తన ఆకలితోనే అతని ఆకలి తీర్చింది.

మేకల్ని తిన్న పులిలా గుడ్డల్ని సవరించుకుని వెళ్ళిపోయాడు బీట్ కానిస్టేబుల్. ఆ మంచంమీద స్పృహతప్పినట్లు పడున్న ఆమెకి ఎప్పుడు నిద్రపట్టిందోకూడా తెలీదు.

* * *

మామూలుగా మర్నాడు సాయంత్రమయేసరికి అలంకరించుకుని అతనికోసం యెదురుచూస్తూ నిలబడ్డది అమృతం. మెల్లగా వీస్తున్న గాలికి ఆమె తలలో సన్నజాజిపూలు బద్ధకంగా కదులుతున్నాయి.

అతనొచ్చే సమయమయింది.

ఆత్రంగా ఎదురుచూడసాగింది.

రెండురోజుల్నుంచీ అన్నం తినకపోవడంవల్ల కల్గిన నీరసాన్ని కూడా ఆ ఆత్రం పూర్తిగా తొక్కేసింది.

ఇప్పుడామె కవేవీ గుర్తులేవు.

అతను రావాలి. అతడ్ని చూడాలి. అదే ఆమెకు కావలసింది.

అటూ ఇటూ చూస్తున్న అమృతం చూపులు ఒకచోట నిలిచి పోయాయ్.



అమృతం ప్రాణం విలవిల్లాడిపోయింది...

అతనెవరో బస్‌స్టాప్ షెల్టర్‌కింద నిలబడి కుడిచేత్తో కడ్డీని పట్టుకున్నాడు.

భరించలేకపోయింది. గబగబా తను వెళ్ళి అతని చేతిని లాగేద్దామనుకుంది.



ఇంతలో బస్సు వచ్చింది. అతడు ఎక్కాడు. హాయిగా గుండెల నిండా వూపిరి పీల్చుకుందామె!



చీకటిపడిపోయింది. ఇంకా ఇవాళ అతనెందుకు రాలేదూ? ఆత్రంగా అతనికోసం ఎదురు చూడసాగింది.

ఉన్నట్టుండి అమృతం పెదవులు విచ్చుకున్నాయ్. కళ్ళు కాంతిని నింపుకున్నాయ్.

అతను మెల్లగా, ఠీవిగా వస్తున్నాడు.

ఆమె గుండెలు గుబగుబలాడాయి.

హృదయంలో పూలు పూశాయి.

ఆమెకు దగ్గరగా వచ్చాడతను.

మరుక్షణంలో అతను తనని దాటివెళ్ళిపోతాడు. ఇప్పుడే తను అతనిని చూడాలి...

తలెత్తింది ధైర్యంగా.

విస్తుబోయింది!

అతను సరాసరి బస్‌స్టాప్‌కేసి వెళ్ళలేదు. తనింటివేపు తిరిగాడు. ఓ క్షణం స్థంభించిపోయింది. అతని వుద్దేశాన్ని గ్రహించింది.

గబుక్కున లోపలకుపోయి ఢళ్ళున తలుపులేసింది.

అమృతానికి నెత్తిన పిడుగులు పడుతున్నట్లుంది.

గబగబా కిటికీ దగ్గరకి వెళ్ళి నిలబడింది.

బస్‌స్టాప్‌లో అతన్లేడు అతనుండడని ఆమెకి తెలుసు. అయినా అటే చూస్తూ నిలుచుండిపోయింది. ఆమె కళ్ళ వెంట నీళ్ళు ధారగా కారసాగాయి.

'నా దృష్టిలో మీరు అందరిలాంటి మనిషికాదు. అందరిలా మీరూ నీచమయిన కోరికలకి లొంగిపోయే నీచమయిన మనిషిలా నా దగ్గరికి రాకూడదు. నేను భరించలేను. నా గుండెల్లోవున్న మీ స్థానాన్ని చెరిపేయలేను!' భోరున ఏడుస్తూ మంచంమీద వాలిపోయింది.

ఠంగుమని వినబడ్డ శబ్దంతో లేచి నిలబడింది అమృతం.

కిటికీ దగ్గర కొచ్చింది.

ఎవరో కుర్రాడు వీధిలైటుని పగలగొట్టడానిక్కి రాళ్లు విసురుతున్నాడు.

అతన్నాగమని గట్టిగా కేకేయాలనుకుంది. ఇంతలోనే అతను విసిరాడు మరోరాయి. అ బల్బుకి తగిలింది. అంతా చీకటి. చీకట్లోకి చూస్తూ నిలబడ్డ అమృత కళ్ళలో వెలుగులు లేవు. చీకటి నీడలు. *

(స్వాతి మాసపత్రిక సెప్టెంబర్ 79)

# దూరం

కి అడుగు పెట్టిన కొడుకును చూడగానే "ఇంటర్వ్యూ ఎలా
ని అడగాలనుకున్నాడు నిరంజనం.

అడగలేకపోయాడు. నోట్లోంచి మాట బయటకు రాలేదు.
క్షమైన పనేమీ కాదు గాని, అడిగిం తర్వాత అతని దగ్గర్నుంచీ
మాధానం వస్తుందోనని ఆ పని చెయ్యలేకపోయాడు.
ఉద్యోగమైనా వీడికొస్తే బావుండు. తను వూపిరి పీల్చు

న్నా! నీకు వనజగారు తెల్సా?" హఠాత్తుగా శేఖర్ అడిగిన
ఒక్కి పడ్డాడు నిరంజనం.

జ!

ళ్ళయింది ఆ పేరు విని...

చేస్తోందో ఇప్పుడు? బహుశా తనూ ఇలానే సంసార బాధ్యతల్తో
వుండి వుంటుంది! అయినా వనజ వీడికెలా తెల్సు?

వనజా?" ఆత్రుతని అణచుకుంటూ అడిగాడు నిరంజనం.

విడే నాన్నా!... చిన్నప్పుడు నువ్వు కొన్నాళ్ళు వాళ్ళింట్లో
వుకున్నావట. వాళ్ళ నాన్నగారు మాష్టారు... ఇవాళ నన్ను
చేసింది ఆమే!" ఎంతో ఆనందంగా చెప్పుకుపోతున్నాడు

"నువ్వు ఫలానా అని ఆవిడకెలా తెల్సు?" ఇన్నాళ్ళ తర్వాత వనజ ఇలా హఠాత్తుగా దర్శనమివ్వడమేకాక ఇంకా తనని గుర్తుపెట్టు కోవడం ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ అనిపించింది నిరంజనంకి. ఒక వేళ గుర్తున్నా తన కొడుకునెలా గుర్తించగల్గింది? అతనికి అంతా అయోమయంగా వుంది.

"ఏముంది నాన్నా, వెరీ సింపుల్! అప్లికేషన్ మీద తండ్రి పేరుంటుంది కదా? నేను లోపలికి వెళ్ళగానే ఆమె అడిగిన మొదటిప్రశ్న 'నువ్వు నిరంజనం గారి అబ్బాయివా?' అని..."

"నువ్వేం జవాబు చెప్పావ్?"

'ఏ నిరంజనంగారి అబ్బాయి ననుకుంటున్నారు?" అని అడిగాను. మనింటిపేరు చెప్పడమే కాకుండా వూరుపేరు కూడా చెప్పి, మీరు కొన్నాళ్ళు వాళ్ళ యింట్లోవుండి చదువుకున్నట్లు కూడా చెప్పారు. ఆ తర్వాత ఆవిడ 'మీరేం చేస్తున్నారు? ఎక్కడ వున్నారు? ఎలా వున్నారు?' మొదలైన ప్రశ్న లడిగారే కాని ఇంటర్వ్యూ చేయలేదు. బయటికి వచ్చేసేటప్పుడు 'మా యింటికి వస్తారా?' అని అడిగాను. 'వస్తానంటే సాయంత్రం వచ్చి తీసుకువెళ్తాను' అని కూడా చెప్పాను.

'ఇక్కడకు వచ్చి నువ్వు నన్ను తీసుకువెళ్ళడం బావుండదు. అదీకాకుండా అర్జెంట్‌గా ఇవాళ సాయంత్రం ట్రైన్‌లోనే నేను హెడ్ ఆఫీస్‌కి వెళ్ళిపోవాలి. టికెట్టు కూడా రిజర్వ్ చేసుకున్నాను. ఏ మాత్రం వీలున్నా మీ నాన్నగార్ని ట్రైన్ దగ్గరకు రమ్మని చెప్పు' అంది..."

వనజకి తనమీద వున్న అభిమానం ఇంకా అలానే వుందన్నమాట! ఆనందంతో వుక్కిరిబిక్కిరైపోయాడు నిరంజనం.



"నాన్నా! సాయంత్రం నువ్వు త్రైన్ దగ్గరకి వెళ్ళినప్పుడు ఒక్క మాటన్నావంటే చాలు, నాకు వుద్యోగం గ్యారంటీ. నువ్వంటే ఆమెకి అంత అభిమానం!''

కొడుకు మాటలు నవ్వు తెప్పించాయ్ నిరంజనంకి. తన జీవితంలో అతి ముఖ్యమైన విషయాన్నే ఆమె నడగలేకపోయాడు. మరి ఈ విషయాన్ని అడగ్గలడా?

"నా విషయం చెప్తావ్ కదూ?'' మళ్ళీ అడిగాడు శేఖర్.

"చూస్తాలే..." ఏం జవాబు చెప్పాలో అర్థంకాక అనేశాడు నిరంజనం.

పొంగుతున్న పాలమీద నీళ్ళు చల్లినట్లయింది శేఖర్ పరిస్థితి. తండ్రి ఆమెకు తన గురించి చెప్తాడు, తనకీ వుద్యోగం తప్పకుండా వస్తుంది అని ఎంతో ఆనందపడిపోయాడు...ప్చ్...

నిరుత్సాహంగా లోపలికి వెళ్ళిపోయాడు శేఖర్.

కొడుకునలా చూసేసరికి జాలేసింది నిరంజనంకి. తనమీద తనకే కోపం వచ్చింది.

తను వట్టి అసమర్థుడు. తనకోసమే కాదు, తనవాళ్ళకోసం కూడా ఎటువంటి పరిస్థితుల్లోనూ, ఎవరిదగ్గరా బయటపడి అడగలేడు. చిన్నప్పుడే పాతుకుపోయిన దురలవాటది! అమ్మని అన్నం పెట్టమని అడిగేవాడు కాదు. పెడితేనే తినేవాడు. లేకపోతే అలానే వుండేవాడు.

తండ్రిని పుస్తకాలు కొనిపెట్టమని కూడా అడిగేవాడు కాడు. ఒక సారి సైన్స్ రికార్డ్ కొనలేదని మాష్టారు క్లాసులోంచి బయటికి పంపించేశారు. అయినా పుస్తకం కోసం తండ్రి నడగలేకపోయాడు. ఆ విషయం పక్కింటి జయ ద్వారా తెలుసుకొని చితక్కొట్టాడు తండ్రి. అన్ని దెబ్బలయినా తను భరించగలిగాడు కాని, కావాలని అడగలేకపోయాడు. వయసుతోపాటే ఆ మొహమాటమూ పెరుక్కుంటూ వచ్చింది. ఎవరినీ ఏమీ అడగలేకపోయేవాడు. ఆ కారణంతో జీవితంలో ఎంతో పోగొట్టుకున్నాడు.

పడక్కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు నిరంజనం. గతమంతా కళ్ళముందు మెదలసాగింది.

తను ఏడవ తరగతి చదువుతున్నప్పుడు హఠాత్తుగా సంవత్సరం మధ్యలో తండ్రికి ఆ వూరునించీ ట్రాన్స్‌ఫరైంది. తనని వెంట తీసు కెళ్ళాలంటే కష్టం. అక్కడికి ఇక్కడికి పుస్తకాల మార్పు...ఏంచేయాలో ఎవ్వరికీ అర్థంకాలేదు.

అటువంటి సమయంలో ఆపద్బాంధవుడిలా అదుకున్నారు రామా రావు మాష్టారు. ఆ సంవత్సరం పూర్తయేవరకూ తమింట్లోనే ఉంచుకొని చదివిస్తానని పట్టుబట్టారు. ఫలితంగా తల్లిదండ్రులు వెళ్ళిపోయినా తనా వూళ్ళోనే మిగిలిపోయాడు.

అప్పుడు తన వయసు పది సంవత్సరా లుంటాయేమో! మాష్టారు వాళ్ళింట్లో ఎంత ఆప్యాయంగా చూసినా దిగులు దిగులుగానే వుండేది.

వారం రోజులు ఎలాగో భరించగలిగాడు. ఆ తర్వాత తనవల్ల కాలేదు. వెంటనే వెళ్ళి అమ్మని చూడాలని మరీ మరీ అనిపించసాగింది. కానీ ఆ విషయం మేష్టారికి చెప్పలేదు.

పెరట్లోవున్న జామచెట్టుకింద కూర్చున్నాడు గుడ్లనీరు కుక్కు కుంటూ. వనజ అక్కడికి ఎప్పుడు వచ్చిందో కూడా తను గమనించలేదు.

''ఎందుకూ ఏడుస్తున్నావ్?" ఆమె ఆశ్చర్యంగా అడిగేసరికి వులిక్కి పడ్డాడు తను.

"అబ్బెబ్బే...ఏంలేదు..." గబగబా చొక్కాతో కళ్ళు తుడుచు కుంటూ అన్నాడు.

"నాకు తెల్సులే...మీ అమ్మ గుర్తుకొచ్చింది కదూ?"

ఆమె అంత ఆప్యాయంగా అడిగేసరికి భోరున ఏడ్చేశాడు. తనకన్నా ఆమె దాదాపు సంవత్సరం చిన్నది. అయినా రెండుమూడేళ్ళు పెద్దదాన్లా ఓదార్చింది. ఆమె ఓదార్పులో స్వాంతన దొరికింది తనకి. అక్కడ్నించీ బలవంతాన తనని ఆడుకోవడానికి లాక్కెళ్ళింది.

ఆ రోజునించీ ఆమె దాదాపు ఎప్పుడూ తనని వెన్నంటే వుండేది. కలిసే స్కూల్‌కి వెళ్ళేవాళ్ళు కలిసే వచ్చేవాళ్ళు, కలిసే ఆడుకునేవాళ్ళు, కలిసే భోంచేసేవాళ్ళు, కలిసే చదువుకునేవాళ్ళు...

రెండు మూడ్రోజులలా గడిచేసరికి తనూ ఆమెను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేని స్థితికొచ్చాడు!

వనజ సావాసంతో ఆరు నెలలూ ఆరు రోజుల్లా గడిచిపోయాయి. మర్నాడే తనా వూరు వదిలేస్తున్నాడు వనజను వదిలి వెళ్ళాలంటే ఎంతో బాధగా వుంది. ఆమే అదే పరిస్థితిలో వున్నట్లుంది. తను చివర పరీక్ష రాసి వచ్చేసరికి ఇంట్లో ఎక్కడా కనిపించలేదు.

సరాసరి జామచెట్టు దగ్గరకి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. అక్కడ దిగులుగా కూర్చొనుంది వనజ.

ఆమెనలా చూసేసరికి తనకి మరింత దిగులేసింది. తనకి దిగులు వచ్చినప్పుడల్లా ఆ చెట్టు దగ్గరికి వెళ్ళికూర్చుంటే, ఆమె వచ్చి ఓదార్చేది. ఇప్పుడామె అక్కడ దిగులుగా కూర్చుంటే, తనకి మరింత గుబులుగా వుంది. ఆమె నెలా ఓదార్చాలో అర్థం కావడంలేదు.

"ఏంటి వనజా, అలా వున్నావ్..." బొంగురు గొంతుతో ఆమె గడ్డాన్ని పైకెత్తుతూ అడిగాడు.

తను పలకరించగానే ఒక్కసారిగా బావురుమంది. తనకీ ఏడుపొచ్చేసింది.

"నువ్వేడవకు వనజా...నాకూ ఏడుపొచ్చేస్తోంది." వెక్కిళ్ళ మధ్య అన్నాడు తను.

"నువ్వు నన్ను విడిచి వెళ్ళిపోతూంటే ఏడుపు రాదేంటి?" అమాయకంగా అడిగింది. అప్పటి ఆమె కళ్ళని ఇప్పటికేకాదు, ఎప్పటికీ మరచిపోలేదు తను.

"ఇప్పుడు వెళ్ళిపోతే మాత్రమేం? మళ్ళా రానా ఏంటి? ప్రతీ శలవుల్లోనూ ఇక్కడికొస్తాను. ఇంచక్కా మనం తొక్కుడుబిళ్ళ, రింగాటలు ఆడుకోవచ్చు."

"నువ్వు తప్పకుండా ప్రతీ శలవుల్లోనూ ఇక్కడికి వస్తావా?" కళ్ళు తుడుచుకుంటూ ఆశగా అడిగింది.

"తప్పకుండా వస్తాను." ఆమె చేతిని చిన్నగా గిల్లుతూ నవ్వాడతను.

ఆమే నవ్వింది.

ఇద్దరూ ఒకళ్ళ చెయ్యి మరొకళ్ళు పుచ్చుకుని ఆనందంగా లోపలికి పరుగెట్టుకొచ్చేశారు.

తను ఆ వూరు వదిలి వచ్చేసేటప్పుడు కూడా ఆమె బస్సుదాకా కన్నీళ్ళతో సాగనంపింది.

మరో మూడు సంవత్సరాలదాకా తిరిగి ఆ వూరు వెళ్ళడానికి పడలేదు. వనజను చూడకుండా అన్నాళ్ళు గడపడం బాధే అయినా తప్పలేదు.

తనెన్నిసార్లు అడిగినా 'ఇప్పుడంత దూరం ఎందుకు?' అంటూ కొట్టిపారేశారు తన మాటని అమ్మా, నాన్న. ఆఖరికి పంపిస్తేనేకాని అన్నం తిననని మారాం చేస్తే, యిక తప్పక పంపించారు. ఆనందంగా బయల్దేరాడు తను.

బస్సు దిగగానే కాళ్ళు చకచకా మేస్టారింటికేసి పడసాగాయి.

వనజ మనసులో ఇంకా తన స్థానం అలానే వుందా? అప్పటిలా ఆప్యాయంగా తనతో మాట్లాడుతుందా?-మేష్టారింటికి చేరుకునేవరకు రకరకాల ఆలోచనలు తన మనసుని వుక్కిరిబిక్కిరి చేయసాగాయి.

"ఏమేవ్! నిరంజనం వచ్చాడు..." తనని చూస్తూనే గట్టిగా కేకేశారు మాస్టారు.

అందరూ ఒక్కసారిగా బయటికొచ్చారు.

వనజ కూడా!

ఆమెను చూడగానే తన కళ్ళు తళుక్కున మెరిసాయ్.

''ఇప్పుడేనా బాబూ రావడం? అంతా కులాసామేనా?'' పలకరించారు మేష్టారి భార్య.

''కులాసాయేనండీ! మావయ్యా వాళ్ళింటికి బయల్దేరాను. చాలా కాలమైంది కదా అని దార్లో ఇక్కడ దిగాను..." తనకి తెలియకుండానే అబద్ధం ఆడేశాడు. అక్కడికే వచ్చానని చెప్పడం తనవల్ల కానిపని!

''అంతేగాని మా ఇంటికి రావాలని రాలేదన్నమాట!'' నిష్ఠూరంగా అంది వనజ. అప్పుడుగాని అర్థంకాలేదు-తను మొహమాటంలో ఏమేమో మాట్లాడి వాళ్ళని నొప్పించాడని!

"అబ్బే...అలా కాదు..." నసిగాడు తను.

''అతను వచ్చి రాకముందే ఏమిటా దండయాత్ర వనజా? ముందతన్ని లోపలికి రానివ్వు." మేష్టారి మందలింపుతో వాకిటికి అడ్డం తప్పుకుని దారినిచ్చింది. అంతా లోపలికి వెళ్ళి హాల్లో కూర్చున్నారు.

మూడు సంవత్సరాల తర్వాత వాళ్ళందర్నీ, అప్పుడు తను తిరిగిన ప్రదేశాల్ని చూస్తుంటే మనసు తియ్యటి బాధతో నిండిపోసాగింది.

ఆ రాత్రి బాగా పొద్దుపోయేవరకు తను, వనజ, ఆమె
ఁజని కబుర్లు చెప్పుకుంటూ గడిపారు.

పొద్దున్నే తను బయల్దేరాడు.

ెండు రోజులుండకూడదూ?" ఎవ్వరూ లేని సమయం
, నెమ్మదిగా అడిగింది వనజ.

గ్గరగా ఆమెను చూస్తుంటేగాని తను గుర్తించలేక
ుంలో వయసు తెస్తున్న మార్పుల్ని! ఆమె దగ్గరగా
కెన్నడూ కలగని వింత అనుభూతి కలగసాగింది!

వుందామనే వుంది. కానీ ఇవాళ అర్జంటుగా ఇంటికి వెళ్ళి
ి చెప్పాను అమ్మతో..."

ంటూవా?"

మాష్టారటుగా రావడంతో వులిక్కిపడి ఇద్దరూ దూరంగా
ర్వాత మళ్ళీ ఆ వూరు వెళ్ళడం పడలేదు.

ి సంవత్సరాల తర్వాత అనుకోకుండా విజయవాడ
ించింది.

ఏదో కాలేజిలో చదువుకుంటోంది. శలవులకు ఇంటికి
ితోపాటే ఇంటికి రమ్మని బలవంతం చేసింది. కానీ వుద్యో
ి త్తలు కావడంతో ఆమెవెంట వెళ్ళలేకపోయాడు. ఆఫీస్
వాడ వెళ్ళిన తను మర్నాడు ఎటువంటి పరిస్థితుల్లోనూ
వ్వాలి. ఇద్దరూ అరగంట లోపలే విడిపోయారు.

ఆమె రూపం మాత్రం మనసులో అలానే ముద్రించుకు
్ళనేది చేసుకుంటే ఆమెనే చేసుకోవాలనికూడా నిశ్చయించు

కానీ ఎలా? ఈ విషయాన్ని ఆమెకి తెలియజేసేదెలా?

ఉత్తరం రాస్తేనో...?

అమ్మో! ఇంకేమైనా వుందా? ఈ విషయం ఇంట్లో వాళ్ళందరికీ తెలిసిపోదూ...ఇంతవరకూ తననెంతో మంచివాడుగా గౌరవించినందుకు బాధపడతారు. తనని ఛీదరించుకుంటారు. నో... అలా జరగడానికి వీల్లేదు. వాళ్ళందరి సంగతెలా వున్నా వనజకి తనంటే ఎలాంటి అభిప్రాయముందో? ఆ విషయం తెలీకుండా తనెలా బయటపడతాడు? ఒకవేళ్ళ ఆమెకు తనంటే ప్రత్యేక అభిప్రాయం లేకపోతే ఆమెను బాధించినవాడు కాడూ? తానామెను బాధించలేడు!

బలవంతాన ఆ కోరికను మనసులోనే తొక్కేశాడు.

ఏ మొహమాటమైతే వనజని తననించీ దూరంచేసిందో అదే మొహమాటం రాధని తన భార్యగా చేసింది.

తన కూతుర్ని చేసుకొమ్మని వచ్చిన మావయ్యని, ఆయన మాటని బలపరిచే అమ్మానాన్నలని తను కాదనలేకపోయాడు. ఫలితంగా రాధ తన జీవిత భాగస్వామి అయిపోయింది.

గడచిన ఈ ఇరవై సంవత్సరాల్లోనూ వనజ తనకెన్నోసార్లు గుర్తొచ్చింది. ఆమెను చూడాలనే కోరిక కూడా ఎన్నోసార్లు కలగింది. కాని వనజ తనకు పరాయి స్త్రీ. అందుకే ఆ ఆలోచనల నన్నిటినీ మనసులోనే సమాధి చేసేశాడు.

"మీరు బండి దగ్గరకు వెళ్తున్నారా? లేదా?" రాధ పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాడు నిరంజనం.

"ఎందుకూ?"

"ఎందుకేమిటండీ నా మొహం! వెనుకటికి మీలాటివాడే రామాయణమంతా విని రాముడికి సీత ఏమవుతుందీ అని అడిగాట్ట! సాయంత్రం రైల్లోనే వెళ్ళిపోతున్నానని చెప్పిందట కదా...!"

"బావుంది. ఆవిడ వెళ్ళిపోతుంటే నేనెందుకు వెళ్ళాలి స్టేషన్‌కి?" వనజని చూడాలనే వున్నా ఆ భావాన్ని మనసులోంచి తోసివేయాలని ప్రయత్నిస్తూ అన్నాడు నిరంజనం.

"ఆవిడ్ని చూట్టానికి కాదండీ మిమ్మల్ని స్టేషన్‌కి వెళ్ళమంటూంది- మనవాడి వుద్యోగ విషయం హెచ్చరించడానికి!"

"బావుంది ఇంతకాలంతర్వాత ఆవిడ కనిపించి మర్యాదగా పలకరించేసరికి రికమండేషన్లకి బయల్దేరనా? నావల్ల కాదు!" అంతవరకూ మనసులో వున్న మాటనే బయటికి వెళ్ళగక్కేశాడు నిరంజనం.

ఆ మాటలు రాధని రెచ్చగొట్టాయి.

"పెళ్ళయినప్పట్నించీ చూస్తూనేవున్నాను. అయినదానికీ కానిదానికీ ప్రతిదానికి మొహమాటం! మీ మొహమాటంతో మేమెన్ని బాధలు పడ్డా పర్వాలేదు. మీరు మాత్రం మీ పద్ధతి మార్చుకోరు...! మీకు నమస్కారం పెడతాను. ఈ ఒక్కసారికి మీ మొహమాటాన్ని విడిచిపెట్టి ఆవిడకి చెప్పండి చాలు... ఇకముందు మా అందరి సంగతీ వాడే చూసుకుంటాడు..." కళ్ళనీళ్ళ పర్యంతమైంది రాధ.

"నాన్నా!... ఆవిడతో నువ్వొక్కమాట చెప్తే చాలు..." జాలిగా దగ్గరకొచ్చాడు శేఖర్.

తన జీవిత సమస్య విషయంలోనే ఆమెముందు బయటపడలేకపోయాడు. ఇప్పుడీ విషయంలో బయటపడగలడా?

తప్పదు: ఆమె కెలాగైనా చెప్పాలి. తన బలహీనతవల్ల తన వాళ్ళంతా బాధపట్టానికి వీల్లేదు. స్టేషన్‌కి వెళ్ళితీరాలి. వనజను కలవాలి. శేఖర్ విషయం ఆమెతో మాట్లాడాలి—

వెంటనే బయటికి బయల్దేరాడు నిరంజనం. ఆయన ఎక్కడికి వెళ్తోందీ అర్థంగాక అలానే చూస్తూ అక్కడే నిలబడిపోయారు తల్లీ కొడుకులు.

*　　　*　　　*

వెళ్ళాలా: వద్దా: అనే సందిగ్ధంలో అటు ఇటు తిరిగి ఎప్పటికో స్టేషన్‌కి చేరుకున్నాడు నిరంజనం.

బండి బయల్దేరడానికి సిద్ధంగా వుంది.

గేటు దగ్గర నిలబడి ఆత్రంగా ఎదురుచూస్తున్న వనజ అతన్ని చూడగానే "నిరంజనంగారూ!..." అంటూ ఆనందంగా కేకేసింది.

"అరె! మీరా:" ఆమెకోసం వచ్చినట్లు చెప్పలేక ఆశ్చర్యాన్ని నటిస్తూ అన్నాడు నిరంజనం.

ఆమెనక్కడ చూడడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించకపోయినా, వయసు తెచ్చిన హుందాతనంతో నిండుగా వున్న ఆమె రూపం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

అవన్నీ వయసుతో వచ్చే మార్పులైనా అతని దృష్టిని ప్రత్యక్షంగా ఆకర్షిస్తున్నాయ్!

ఎంత మారిపోయింది! అప్పటి చిలిపి వనజకు, ఈ వనజకూ ఎక్కడా పోలిక లేదు! విస్తుపోయి ఆమెను చూస్తూ నిలబడిపోయాడు నిరంజనం.

"అదేంటి? మీరు నాకోసం కాదా వచ్చింది!" ఆశ్చర్యంతోను, బాధతోను ఆమె మాటలు నీరసంగా వచ్చాయి.

నిరంజనం మనసు కలతపడింది.

తను వచ్చింది ఆమె కోసమే! అయినా ఆ విషయాన్ని ఆమె ముందు చెప్పలేకపోయాడు, ఈ బలహీనత తనని వదల్దు...!

"మీవాడు చెప్పలేదా?" మళ్ళీ ఆమె ప్రశ్నించింది.

"చెప్పలేదు..." మొదటి అబద్ధాన్ని కప్పిపుచ్చుకోడానికి మరో అబద్ధం ఆడేడు.

రైలు గట్టిగా కూత వేసింది.

"ఇక్కడ కొన్ని ఇంటర్వ్యూలు కండక్ట్ చేయడానికి నిన్న వచ్చాను. నాకు మీరిక్కడ వుంటున్నట్లు ముందే తెలిసుంటే ఖచ్చితంగా మీ ఇంటికి వచ్చుండేదాన్ని..." చిన్నగా నవ్విందామె.

కంగారుపడ్డాడు నిరంజనం.

"నువ్వీ వూరు వచ్చావని తెలిస్తే నేను మాత్రం వూరుకునేవాణ్ణా ఏం! ఇంతకీ ఇప్పుడేవూళ్ళో వుంటున్నారు?" అడిగాడు.

జవాబు చెప్పిందామె.

మరోసారి కూతవేసి నెమ్మదిగా బయల్దేరింది రైలు.

"మీ ఆయన కూడా అక్కడే పనిచేస్తున్నారా? ఏం చేస్తున్నారు?" అతనడిగిన ప్రశ్నలకు ఆమె చెప్పిన జవాబు రైలు శబ్దంలో కలిసిపోయింది.

దూరమైపోతున్న ఇద్దరూ ఒకళ్లనొకళ్ళు కన్నీళ్ళు పొరలగుండా చూసుకోసాగారు.

అతని మొహమాటమే ఆమెను కన్యగా మిగిల్చిందని అతనికి తెలీదు. అంతేకాదు-తనలాగే మరికొన్ని జీవితాలు కూడా అతని మొహమాటానికి బలై పోగూడదని ఆమె శేఖర్‌కి ఆ ఉద్యోగం వచ్చేటట్లు చేసిన విషయం కూడా అతనికి తెలీదు. అతని కొడుకే తన కొడుకనుకొంటున్న ఆమెకు ఆ విషయం అతనికి తెలీడం కూడా ఇష్టంలేదు. ఎప్పుడూ ఒకళ్ళ మనసులో మరొకళ్ళు నిండుకొని వున్నా ఆ విషయాన్ని ఇద్దరూ బయట పెట్టలేదు. వాళ్ళమధ్య దూరం ఎప్పటికీ తరగనిది! *

(ఆంధ్రపత్రిక 1978.)

# కుక్రకుంక

కాళ్ళు కడుక్కుని వస్తున్న పాపారావుకి హఠాత్తుగా ఏదో గుర్తు కొచ్చింది.

గబగబా వెళ్ళి యూనిఫారమ్ పాంటు జేబులు వెదికాడు. నాల్గు మడతలు పెట్టున్న యాభై రూపాయల నోటు జేబులో ఓమూల చిక్కడి పోయింది. దాన్ని బయటికి తీశాడు.

మడతలు విప్పగానే ఆ కుర్రాడి మొహం కనిపించింది. పాపారావుకి జాలేసింది.

కుర్రవెధవ! కాకీబట్టలు చూసి బెదిరిపోయాడు. నిజంగానే సాని కొంపలోంచి లాక్కొచ్చాననని బొక్కలో తోస్తాననుకున్నాడు. సానికొంప లోకి వెళ్ళే ధైర్యమే వుంటే నాకు టోకరాయే కొట్టేవాడు. వెర్రివెధవ...!

ఆ నోటు పట్టుకుని బీరువా దగ్గరకి వెళ్ళాడు. లాకర్ తెరిచి దాంట్లో పడవేయబోయినవాడల్లా ఆగి మామూలు అలవాటు ప్రకారం పెన్‌తో దానిమీద 'పి' అని రాసి మరీ పడేశాడు.

"ఇంకెంత సేపండీ... రండి భోజనానికి..." భార్య పిలుపు వినిపించగానే బీరువా తాళంవేసి, చెవులని దేవుడి బొమ్మ దగ్గర పడేసి వంటింట్లోకి దారితీశాడు పాపారావు.

* * *

రాత్రి పన్నెండయింది.

రోడ్డు మీద ఎక్కడా జనసంచారం లేదు. చిరాకనిపించింది పాపా రావుకి.

మనుషులే కనిపించకపోతే తను నోట్లు చూసేదెలా? కనీసం ఒక్క యాభై రూపాయల నోటునైనా చూడకుండా డ్యూటీ దిగకూడదని తను నిన్ననే నిర్ణయించుకున్నాడే... మరిప్పుడెలా? ద్వితీయ విఘ్నం అసలు మంచిది కాదు... ఎలాగైనా ఈరోజు సంపాదన యాభై తగ్గడానికి వీల్లేదు. స్థిరనిశ్చయానికొచ్చాడు పాపారావు.

పోలీసు తలచుకోవాలేగాని పైసలకి కొదవా! పకపకా నవ్వాలనిపించింది పాపారావుకి. ప్రస్తుతానికి ఆ కోరిక వాయిదా వేసుకొని పైసల వేటలో ముందుకు కదిలాడు...

మరో అరగంట గడిచింది.

బీట్ ఏరియానంతట్నీ ఓసారి చూడడం అయిపోయింది. అయినా బేరం కాలేదు. పాపారావులో అసహనం క్షణక్షణానికి పెరగసాగింది... అయినా బుర్ర పనిచేయటం మందగించలేదు. ఇంకా చురుగ్గా ఆలోచించ సాగింది.

హఠాత్తుగా అతని బుర్రలో మెరుపు మెరిసింది.

కులాసాగా లాఠీ వూపుకుంటూ నూతనోత్సాహంతో ముందుకి కదిలాడు.

ఆ సందులోకి అడుగుపెట్టగానే అతని వుత్సాహం ద్విగుణీకృత మైంది.

రోడ్డు మధ్యలో నిలబడి ఆ వీధిలోవున్న వాకిట్లన్నింటివేపు ఓసారి దృష్టి సారించాడు. అన్ని ఇళ్ళ తలుపులూ వేసేవున్నాయి. అంటే అందరూ బిజీగా వున్నారన్నమాట!



ఏ ఇంటి తలుపు కొట్టాలి?

మళ్ళీ ఓసారి అన్ని గుమ్మాలకేసి చూశాడు.

ఓ ఇంటిని ఎన్నుకుని గబగబా అటు కదిలాడు.

తలుపుమీద లాఠీతో కొట్టాడు - తియ్యమన్నట్లు!

హఠాత్తుగా లోపలి గుసగుసలు ఆగిపోయాయి. సూది కిందపడితే వినిపించే నిశ్శబ్దం!

"నాకు అన్నీ తెలుసులే...ముందు తలుపుతియ్యి..." లాఠీని మళ్ళీ తలుపు మీద టకటకలాడిస్తూ గట్టిగా అరిచాడు.

వెనక తలుపులు తీస్తున్న శబ్దం.

"తియ్యమంటుంటే వినిపించడంలా? వాడెళ్ళిపోయినా నిన్ను వదలను"

తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా బిక్కు బిక్కుమంటూ సావిత్రి నిలుచుంది.

"తప్పుకో..." ఆమెను తోసుకుంటూ లోపలికి దూసుకుపోయాడు పాపారావు.

అతను లోపల తలుపు దగ్గిరకి వెళ్ళగానే ఎవరో చటుక్కున గోడ దూకి పరుగెత్తుకెళ్ళిపోయాడు. చీకటిలో ఎవరో కుర్రాడిలా కనిపించింది. గోడదూకి వాడిని వెంటాడే ఓపికలేక వెనక్కి తిరిగాడు.

సావిత్రి దిగులుగా అక్కడే నిలుచునుంది. పాపారావుకి పాపం అనిపించలేదు. పాప పుణ్యాల గురించి ఆలోచిస్తే పైసలు సంపాదించలేం. ఇది పాపారావు పద్ధతి.

"వాడిచ్చిన పైసలు ఇలా పారేయ్, నే పోతా." నిర్లక్ష్యంగా చెయ్యి చాపాడు.

"ఏదీ... అతను ఇవ్వకుండానే నువ్వొచ్చేశావ్...అతను పారిపోయాడు" నసిగింది.

"ఈ కబుర్లు నాకు చెప్పకు... మర్యాదగా ఇస్తావా? నన్నే తీసుకొమ్మంటావా?" ఆమె గుండెలవేపే చూస్తూ ఒకడుగు ముందుకేశాడు.

వులిక్కిపడి జాకెట్టువేపు చూసుకుంది సావిత్రి. జాకెట్టులోంచి బయటికి తొంగిచూస్తూ యవ్వనపు పొంగులు... వాటి మధ్య యాభై రూపాయల కాగితం...!

ఆమె గుండె ఝల్లుమంది. ఇది వీడి కంటపడిందన్నమాట! అయితే దీనికి కాళ్ళు వొచ్చినట్లే!!

"ఎంతసేపు నుంచోవాలి?" చొరవగా జాకెట్టులో చెయ్యిపెట్టి దాన్నందుకో బోయాడు పాపారావు.

భయంతో వెనక్కి జరిగింది సావిత్రి. వీడితో గొడవపడితే లాకప్పులో వేయిస్తాడు... రెండు మూడు రోజులు అన్నం నీళ్ళు వుండవు... పైగా పోలీసోళ్ళందరూ అవురావురుమంటూ చేరతారు.. తక్కున ఆ కాగితాన్ని బయటికి తీసింది. గబుక్కున ఆమె చేతుల్లోనుండి దాని లాక్కున్నాడు పాపారావు.

'నా దగ్గర వేధవ్వేషాలు వెయ్యకు...' లాఠీ వూపుకుంటూ బయటికి దారితీశాడు.

సావిత్రి స్థాణువులా అక్కడే నిలబడిపోయింది.

*　　*　　*

యూనిఫారమ్ విప్పి కాళ్ళు కడుకుని వెళ్తున్న పాపారావుకి హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చింది.

గబగబా వెళ్ళి యూనిఫారమ్ పాంటు జేబులు వెదికాడు. ఆనందంగా యాభై రూపాయల నోటుని బయటికితీసాడు.

లాకర్ తెరిచి దాంట్లో దాన్ని పడేయబోతూ ఆగాడు. పెన్నందుకుని దానిమీద రాద్దామని నోటుని విప్పేడు- 'పి' అన్న పెద్ద అక్షరం అతన్ని వెక్కిరించింది.

గబగబా కాష్‌బాక్స్ తడిమాడు. ఖాళీగా వుంది! అనుమానం వచ్చి వెనక్కి తిరిగాడు.

ఎవరో గుమ్మం అవతల చటుక్కున పక్కకి కదిలారు.

గబగబా ముందుకొచ్చిన పాపారావు ఒక్క గెంతులో గేటుదాటి రోడ్డుమీదకి వెళ్ళిన కొడుకుని చూశాడు.

హఠాత్తుగా చీకట్లో సావిత్రి ఇంట్లో గోడదూకిన ఆకారం పాపారావు కంటిముందు మెదిలింది.

పాపారావు స్థాణువులా నిలుచుండిపోయాడు! •

(విపుల మే 1988)

# పాలిష్

ప్రభాకరం వాచీ చూసుకున్నాడు.

రెండున్నర.

ఎండ నిప్పులు చెరుగుతోంది. చొక్కా చాలాభాగం, లోపలి బనీను పూర్తిగానూ - చెమటతో తడిసిపోయేయి. చిరాగ్గా వుంది.

ముఖాన్న పట్టిన చెమటని రుమాలుతో తుడుచుకున్నాడు. దేహం గరగరలాడింది. మంటగా తోచింది.

అసహనంగా చుట్టూ చూసేడు ప్రభాకరం.

బస్‌స్టాండ్ అంతా పెళ్ళి పందిరిలా సందడిగా వుంది. అవును. ప్రయాణీకుల్లో సగభాం - పెళ్ళివారే; ఎండాకాలానికీ - పెళ్ళి ముహూర్తాలకూ అసలు చక్కటి ముహూర్తం కుదిర్చేడు భగవంతుడు.

ప్రయాణీకుల కోలాహలంలో-ఒకదాని వెంట ఒకటి; ఒక్కొక్క ప్లాట్‌ఫారమ్‌నుంచీ - బస్సులు పోతూనే వున్నై. ప్రతి బస్సుకూ రద్దీ! త్రొక్కిసలాట! ప్రతి బస్సూ వోవర్‌లోడెడ్!

కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తూనే వున్నాడు; బస్సు జాడ లేదు.

ప్రభాకరం మళ్ళీ వాచీ చూసుకున్నాడు. రెండూ ముప్పై అయిదు! నిముషాలు యుగాలు కావటమంటే ఇదే కాబోలు.

వొళ్లంతా చిరాగ్గా వుంది. మనసంతా చీదర చీదరగా వుంది. ప్రభాకరంకి ఎండలో ప్రయాణం చెయ్యడమంటే మహా చిరాకు. పైగా ఎండగా వున్నప్పుడు, వాకిలికి వట్టివేళ్ల తడికని వేళ్ళాడదీసి, హాల్లో సీలింగ్ ఫాన్ కింద పడక్కుర్చీలో పడుకుని వక్కపొడి నములుతూ శోభతో కబుర్లు చెప్పడమంటే మహా సరదా. కాని ఈ ప్రయాణాన్ని తప్పించుకో లేకపోయేడు.

కాదు. ఈ ప్రయాణాన్ని తప్పించుకునే అవకాశం శేఖర్ తన కివ్వలేదు.

శేఖర్!—

తనకున్న ఒకేవొక్క ఆప్తమిత్రుడు.

ఆప్తమిత్రుడే కాదు; ఆత్మీయుడు కూడా—

అలాంటి శేఖర్ ఈవేళ వో యింటివాడు కాబోతున్నాడు. ఈ రాత్రి ఎనిమిదింటికి శేఖర్ పెళ్ళి.

శేఖర్ పెళ్ళికి తాను వెళ్ళి తీరాలి.

అందుకే ఈ ప్రయాణం.

బస్సు జాడలేదు. కాళ్లు పీకుతున్నాయి. ప్రక్కగావున్న సిమెంటు బెంచీమీద ముగ్గురు కూర్చుని వున్నారు. వాళ్ళకి చివరిగా ఖాళీ వుంది.

ప్రభాకరం బెంచీమీద అక్కడ కూర్చున్నాడు.

నిరీక్షణ ఎంతటి శాపమో అర్థమౌతోంది ప్రభాకరంకి. ఎండలో ఇలా పడిగాపులు కాయాల్సొస్తుందనే నిన్న ఫోన్‌లో విచారించాడు తను. చుండూరు వెళ్లే బస్సు రెండు గంటలకు వుందనీ; చివరి బస్సు రాత్రి తొమ్మిదింటికని చెప్పాడు ఎంక్వాయిరీ క్లర్కు. రాత్రి బస్‌కి వెళ్తే లగ్నం అయిపోతుంది. అందుకనే ఈ బస్‌కి బయల్దేరాడు తను.



రెండు గంటల బస్సు—

రెండు నలభై దాటుతోంది. అయినా అంతులేదు.

ఎండ నిప్పులు చెరుగుతోంది; వేడిగాలి సుళ్ళు తిరుగుతోంది. చిరాగ్గా వుంది. నాలుగో నెంబరు ప్లాట్‌ఫారమ్ తాలూకు రేకులషెడ్ త్రీవ్రతాపాన్ని క్రిందకు బదిలీ చేస్తోంది.

"బాబూ! పాలీష్ సేత్తాను బాబూ!" ప్రభాకరం ఆలోచనలకి అంతరాయం కలిగింది. విసుగ్గా పక్కకి తిరిగాడు.

సుమారు పన్నెండేళ్ళ కుఱ్ఱాడు నిలబడున్నాడు. అక్కడక్కడా చిరిగి బాగా మాసిపోయిన వాడి చొక్కా లాగూ వాడి వంటిని పూర్తిగా కప్పలేకపోగా, ఒక విధమైన దుర్వాసనను వెదజల్లుతున్నాయి. తైల సంస్కారంలేని జుట్టు చిందరవందరగా వుండి వాడి దీనస్థితిని మరింతగా వ్యక్తపరుస్తోంది. వాడు తన చేతిలోవున్న సంచీని నేలపైపెట్టి ప్రభాకరం కాళ్ళదగ్గర కూలబడ్డాడు.

'బూటులు తలతలా మెరిసిపోయేట్టు పాలీష్ సేత్తా బాబూ! ఒక్క పావలా కాసీ ఇప్పించండి సాలు..." ఆశగా ప్రభాకరం వంక బూట్ల వంక మార్చి మార్చి చూస్తూ వాడి ధోరణిలో వాడు చెప్పుకుపోసాగాడు.

"అక్కర్లేదు వెళ్ళు." ప్రభాకరం మనసులోని విసుగంతా మాటల్లో ధ్వనించింది.

నిస్సహాయంగా ప్రభాకరం వేపొక చూపు చూసి, సంచీ భుజాన తగిలించుకుని, 'పాలీష్' అని అరుచుకుంటూ ముందుకు సాగిపోయాడు వాడు.

బస్సింకా ఎందుకు రాలేదో కనుక్కుందామని ఎంక్వయిరీ ఆఫీసువేపు బయల్దేరాడు ప్రభాకరం.

"చుండూరు వెళ్ళే బస్సెన్నింటికండీ?" ప్రభాకరం అడిగాడు ఎంక్వయిరీ క్లర్క్ ని.

"రెండుగంటలకండి!" ఎంక్వయిరీ క్లర్క్ తన మామూలు ధోరణిలో జవాబిచ్చాడు.

"ఇప్పుడు మూడు కావస్తోంది కదండీ!"

"పదిగంటలకి వెళ్ళిన బస్సే తిరిగొచ్చి రెండు గంటలకి రెండో ట్రిప్పుగా బయల్దేరుతుందండి. పదిగంటలకు వెళ్ళి బస్సు ఇంతవరకూ తిరిగి రాలేదు. రాగానే బయల్దేరుతుంది. మీరు నాల్గో నంబరు ప్లాట్‌ఫారం మీదకి వెళ్ళండి. బస్ అక్కడికే వస్తుంది."

ప్రభాకరంకి వెంటనే తిరిగి ఆ ప్లాట్‌ఫారం మీదకి వెళ్ళాలనిపించ లేదు. కాస్త రిలీఫ్‌కోసం కాంటీన్‌వేపు దారితీశాడు. కాఫీ తాగి బస్సొచ్చేసిం దేమోనని వెంటనే నాలుగో నెంబరు ప్లాట్‌ఫారమ్ మీదకి వచ్చాడు. ఇంకా రాలేదు. ఇందాక తను కూర్చున్న చోటు ఖాళీగానే వుంది.

అదే స్థలంలో కూలబడ్డాడు.

'కనీసం ఆదివారం మధ్యాహ్నం కూడా శోభ చేతి కాఫీ తాగే ప్రాప్తం లేదు.' ప్రభాకరం మనసు బాధతో మూల్గింది. శోభ గుర్తుకు రాగానే అతని మనసు కొద్దిగా వుత్సాహాన్ని పుంజుకుంది. ఆలోచన్లు శోభ చుట్టూ పరు గెత్త సాగాయి.

'శోభ తన భార్య కావడం నిజంగా తన అదృష్టమే. శోభను చేసుకున్న తరువాతే తనకి వుద్యోగం వచ్చింది.'

కాఫీ తన ప్రభావాన్ని చూపుతోంది. శరీరమంతా వుడికిపోతోంది. గుడ్డలు చెమటతో పూర్తిగా తడిసిపోయేయి. అయినా అతని ఆలోచన్లు శోభ చుట్టూ పరిభ్రమించసాగాయి.

"సార్..." పిలుపుతో ప్రభాకరం మనసు శోభ దగ్గర్నుంచి వెనక్కి పరుగెత్తుకొచ్చింది.

ఎదురుగా ఇందాకటి పాలీష్ కుఱ్ఱాడు నిలబడున్నాడు. చాచి చెంప దెబ్బ కొడదామనిపించింది ప్రభాకరంకి.

"సార్... పాలీస్..."

"ఇందాకే అక్కర్లేదని చెప్పలా- మళ్ళీ ఎందుకొచ్చావ్?" మండి పడ్డాడు ప్రభాకరం.

"ఒక్క పదేను పైసలిప్పించండి సాలు. బూట్లు నద్దంలా సేత్తా బాబూ!" ప్రాధేయపడ్డాడు వాడు.

"బూట్లు బూట్లులా వుంటే చాలు. అద్దంలాగానూ వద్దు, దువ్వెన లాగానూ వద్దు. వెళ్ళు." మారు మాట్లాడకుండా చేతిసంచీతో ముందుకు సాగి పోయేడు పాలీష్ కుఱ్ఱాడు.

విసుగ్గా వాచీవంక చూసుకున్నాడు. మూడు దాటింది. ఇంకా బస్సురాలేదు. మళ్ళీ ఎంక్వయిరీ ఆఫీస్‌వేపు బయల్దేరాడు.

"చుండూరు వెళ్ళే బస్సెప్పుడు వస్తుందండీ?"

"ఈపాటికి రావల్సిందండి. బహుశ బస్సు మధ్యలో ఎక్కడో ట్రబులిచ్చి వుంటుంది."

"ఎంత సేపట్లో రావచ్చంటారు?"

"ఆ విషయం నాకెట్లా తెలుస్తుందండి? ఈపాటి కెప్పుడో రావల్సింది; రాలేదు." అతని కంఠంలో కొద్దిగా విసుగు ధ్వనించింది.

ఇంకా అక్కడ నిలబడ బుద్ధిపుట్టలేదు ప్రభాకరంకి. బుక్‌స్టాల్‌లో వీక్లీ కొని తిరిగి నాలుగో నెంబరు ప్లాట్‌ఫారమ్ చేరుకున్నాడు.

తనచోటు తనని నవ్వుతూ ఆహ్వానిస్తోంది. అక్కడే కూలబడి వీక్లీ తిరగెయ్యసాగాడు.

మరో పావుగంట గడచినా బస్సురాలేదు. పుస్తకం చదవబుద్ధి పుట్టడంలేదు. పుస్తకం మూసేసి బస్‌స్టాండ్‌లో తిరుగుతున్న మనుషుల్ని చూస్తూ గడపసాగాడు.

ఊగో నెంబరు ప్లాట్‌ఫారమ్ కెదురు ఎనిమిదో నెంబరు ప్లాట్ ందున్న మనుషుల్ని పైసలడుక్కుంటోంది ఓ పిల్ల.

పిల్లకి షుమారు పదేళ్ళుంటై. ఒక చెయ్యి, ఒక కాలూ అవిటి. నెంబరు ప్లాట్‌ఫారమ్ మీద మనుషుల్ని యాచించడం అయి గాలుగో నెంబర్ ప్లాట్‌ఫారమ్‌కేసి బయలుదేరింది.

ఇంతలో ఓ ముసలమ్మ గబగబా పిల్ల దగ్గరికొచ్చింది. ఆ పిల్ల లోనున్న చిల్లర్ని ముసలమ్మ చేతిలో పోసింది. ఆ చిల్లర తీసుకుని సురుగా వచ్చిందో, అంత విసురుగానూ వెనుదిరిగింద ముసలమ్మ.

ప్రభాకరంకి తనెప్పుడో చదివిన కథ గుర్తుకొచ్చింది.

'ఒక నిర్భాగ్యుడు తన కన్న కొడుకు, కూతురూ అనే మమకారాన్ని మరచి; చిన్నప్పుడే వాళ్ళకాళ్ళూ చేతులూ విరిచేస్తాడు. తరువాత గాటికోసం వాళ్ళతో వ్యాపారాన్ని ప్రారంభిస్తాడు.'

ఆ పిల్ల నాల్గో నెంబరు ప్లాట్‌ఫారమ్ మీద యాచించడం ప్రారం చె. ప్రభాకరం చూపులు ముసలి దానికోసం పరుగెత్తాయి. ముసలమ్మ రో నెంబరు ప్లాట్‌ఫారమ్ చివర మరో ముష్టిపిల్లతో మాట్లాడుతోంది.

"సార్, బూట్లకి పాలీస్ సేత్తాను. మీ ఇట్టం వచ్చినంత దయ ుసండి." జాలిగా దగ్గర కొచ్చాడు పాలీష్ కుఱ్ఱాడు.

తన ఆలోచనలకి అడ్డం వచ్చిన వాణ్ణి మూతిమీద తన్నాలనిపించింది కరంకి. కానీ, అది బస్‌స్టాండ్ అని వూరుకున్నాడు.

"నీకెన్నిసార్లు చెప్పాలి? వెళ్ళవతలికి."

"ఆ మాటనకండి సార్! ఇయాల తెల్లారిన తరువాత పచ్చి మంచి కూడా తాగలేదు. మీరు బూట్లకి పాలీష్ సేయించుకుని కనీసం ుసలన్నా ఇత్తే సింగిల్ టీ తాగుతా బాబూ!" ఆశగా చూడసాగాడు ాకరంవేపు.

"నాకు పాలిష్షూ అక్కర్లేదు; పాడూ అక్కర్లేదు. వెళ్ళవతలికి పో..." ప్రభాకరంలోని విసుగు తారస్థాయి నందుకుంది.

'అసలివాళ బస్సొస్తుందో, రాదో కనుక్కోవాలి!' ఎంక్వయిరీ ఆఫీస్‌కేసి బయల్దేరాడు.

"ఏఁవండీ! చుండూరు వెళ్ళే బస్సు ఇవాళ వస్తుందంటారా?"

''ఎన్నిసార్లు చెప్పనండి - పదిగంటలకి వెళ్ళిన బస్సు ఇంత వరకూ తిరిగి రాలేదు.''

''అది రాకపోతే ఇక్కడ్నించీ మరో బస్సును పంపరా?''

''ఆ విషయాలేవీ నాకు తెలీవండి. ప్లాట్‌ఫారమ్ మీద ఇనస్పెక్టర్ గారుంటారు. ఆయన్నడగండి.'' విసుగ్గా జవాబిచ్చి ఫోన్ మోగుతుంటే రిసీవర్ అందుకున్నాడు.

చెంపమీద కొట్టినట్లనిపించింది ప్రభాకరంకి. బస్ రాలేదన్న విసుగు, చిరాకు, కోపం-పోయి; ఎంక్వయిరీ క్లర్క్ సమాధానానికి కోపం, ఉక్రోషం కలిగేయి.

'డర్టీ నాన్సెన్స్!' గొణుక్కున్నాడు.

'గంటలు గంటలు లేటు.' తనలో తాను సణుక్కున్నాడు.

భారంగా అడుగు లేస్తూ పచార్లు చెయ్యటం మొదలెట్టాడు.

''సార్! పాలిస్'' మళ్ళీ ప్రత్యక్షం.

ప్రభాకరం వాడికేసి పురుగుని చూసినట్లు చూసేడు. కళ్ళు చికిలించేడు; నొసలు చిట్లించేడు; మూతివంకర తిప్పేడు.

వాడికళ్ళల్లో దైన్యం, వాడి మాటల్లో ప్రాధేయత; వాడి చూపుల్లో అభ్యర్థన పీటన్నిటికీ వెనగ్గా నీడలా వాడిని తరుముతున్న అవసరం;

ఆ అవసరానికి ముఖ్యమైన ఆకలి: - వీటన్నిటికీ మించి ఎంక్వయిరీ క్లర్క్ మాటల్లోని విసుగు, కోపం, చిరాకు, అసహ్యం తక్కున స్ఫురించేయి.

ఇవన్నీ గోచరించడంతో ప్రభాకరం విచలితుడైనాడు. ఏదో ఆలోచన మెరుపులా మెరిసింది.

జేబులోనుంచి అర్ధరూపాయి నాణెం తీసి వాడివేపు విసిరేడు. కళ్ళల్లో ఆనందమైన మెరుపుతో వంగి దాన్ని తీసుకున్నాడు వాడు. అప్పటికప్పుడే ప్రభాకరం ముందుకి నడిచేడు.

"సార్! పాలీస్... సార్..." వాడు అరుస్తున్నాడు.

"వద్దులే పోరా..." అంటూ గబా కాంటీన్‌వేపు అడుగులు వేయ సాగాడు ప్రభాకరం. 'తనకింక ఏ పాలిష్ అక్కర్లేదు. అవసరం మనిషిని చేయిపట్టి నడిపిస్తుంది. ఆతృతని పెంచుతుంది. వివేకాన్ని మరుగు పరుస్తుంది. తను ఇతరుల్ని చీదరించుకున్నట్లు మరొకరు తనను చీదరించు కున్నప్పుడే బుద్ధి వికసిస్తుంది. వేదాంతిలా సన్నగా నవ్వుకున్నాడు ప్రభాకరం.

పిలుస్తున్నా పలక్కుండా వెళుతున్న ప్రభాకరాన్ని చూసి విస్తు పోతూ నిలబడ్డాడు పాలిష్ కుర్రాడు.

(జ్యోతి మాసపత్రిక మార్చి 1975)

# మనసు చెప్పని మాట

పెళ్ళికూతుర్ని కళ్యాణ వేదికమీదికి తీసుకువచ్చారు. అంతవరకు అందరూ ఏమనుకుంటారో అనే భయంతో ఇష్టం లేకపోయినా అక్కడ వున్నాను. ఇక వుండడం నావల్ల కాలేదు. గబగబా అవతలికి వచ్చేశాను.

నా ప్రాణానికి ప్రాణమైన రాణి మరికొన్ని నిముషాల్లో పరాయి వ్యక్తికి భార్యయిపోతోంది. అతనికి ఇష్టముంటేనే రాణితో మాట్లాడాలి. లేకపోతే లేదు. ఏడుపు వస్తోంది.

బలవంతాన కన్నీళ్ళని అదుపులో పెట్టుకుంటూ గుడిదగ్గరకి చేరుకున్నాను.

అక్కడి పరిసరాలు నన్ను గతంలోకి లాక్కువెళ్ళాయి.

నేను, రాణి ఆడుకోడానికి అక్కడికి ఎన్నోసార్లు వచ్చాం. చిన్నప్పటినుండీ నాకు రాణితో తప్ప మరెవ్వరితోనూ ఆడడం ఇష్టం వుండేది కాదు.

తనకి కోపంవస్తే 'చిన్నపిల్లాడివి, నీతో నాకు ఆటలు ఏమిటి?' అనేది.

అంతే! నాకు చర్రున కోపం వచ్చేసేది.

నాకన్నా తను రెండేళ్ళు పెద్ద. అదీ బడాయి! తన ఆధిక్యతని చూపుకోవాలనుకున్నప్పుడల్లా 'చిన్న పిల్లాడివి నీకేం తెల్సు' అనేది. ఏ మాటనయినా భరించగలిగేవాణ్ని కాని. నన్ను చిన్నవాణ్ని చేస్తూ మాట్లాడితే మాత్రం భరించలేకపోయేవాణ్ని.



వయసుతోపాటే ఆమెమీద అభిమానం కూడా పెరగసాగింది. ఇద్దరం కలిసి స్కూలుకి వెళ్ళేవాళ్ళం, కలిసి ఆడుకునేవాళ్ళం. పక్క పక్క ఇళ్ళే కావడంతో ఇద్దరం ఎక్కువకాలం కలిసే వుండేవాళ్ళం.

ఒకరోజు స్కూల్‌కి వెళ్తూ రాణి కోసం వెళ్ళాను. "ఇవాళ నుంచి రాణి స్కూల్‌కి రాదురా..." అంది అత్తయ్య.

నాకు విపరీతమైన కోపం వచ్చింది. ఏమిటి అత్తయ్య ఇట్లా మాట్లాడుతోంది?

"రాణి ఎక్కడుంది?" అడిగాను కోపాన్ని దిగమింగుకుంటూ.

"పెరట్లో..."

గబగబా అటు వెళ్ళాను.

నన్ను చూస్తూనే రాణి సన్నగా నవ్వింది. ఆ నవ్వులో సిగ్గుకూడా వుంది.

"రాణీ! నువ్వు స్కూలుకి రావా ఇవాళ్టి నుంచీ?" అడిగాను.

"ఊహూఁ..." రానన్నట్లు తల వూపింది.

"ఏం? ఎందుకు?" వుక్రోషంగా అడిగాను.

"చిన్నపిల్లాడివి, నీకు తెలీదులే ఇప్పుడు... కొన్నాళ్ళుపోతే నీకే అర్థమవుతుంది" అంది.

అంతే! నా కోపానికి హద్దులు లేకుండా పోయింది. ఇవతలికి వచ్చేశాను. ఒక్కణ్ణే స్కూలుకి వెళ్ళాలనిపించలేదు. అలా అలా తిరిగి ఎప్పటికో ఇంటికి చేరుకున్నారు.

రాణి వాకిట్లో పెద్ద పేరంటం చేశారు.

అప్పటినుంచీ మా ఇద్దరిమధ్యా దూరం పెరిగిపోసాగింది. ఇదివరకటిలా ఆడుకోవడానికి రావడం కూడా తగ్గించేసింది రాణి.

"నువ్వింకా చిన్నపిల్లాడివి. నేను నీలా ఆటలు ఆడితే నవ్విపోతారు ఎవరైనా." పెద్ద ఆరిందాలా అనేది. నాకు చిర్రెత్తుకొచ్చేది.

స్కూలు లేని సమయాల్లో ఇద్దరం వాళ్ళ పెరట్లోనో, మా పెరట్లోనో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుండేవాళ్ళం.

హఠాత్తుగా ఓ రోజు స్కూలునుంచీ వచ్చేసరికి పిడుగులాంటి వార్త చెవినబడింది-రాణిని చూడడానికి ఎవరో వస్తున్నారు!

పెళ్ళి అంటే నాకు పూర్తి అర్థం తెలీకపోయినా రాణికి పెళ్ళి అంటే బాధగా అనిపించింది. అతనెవర్నో పెళ్ళి చేసేసుకుని రాణి నాకు దూరంగా వెళ్ళిపోతుందా? ఆ ఆలోచనని భరించలేకపోయాను.

సరాసరి ఆమె దగ్గరకి పరుగెత్తుకెళ్ళాను. బాధగా బాదం చెట్టు క్రింద కూర్చుంటుందనుకున్న రాణి అందంగా అలంకరించుకుని ఆనందంగా కనిపించేసరికి వళ్ళుమండిపోయింది.

"నీకు బాధగా లేదూ!" అడిగాను.

"ఎందుకు?"

"నిన్ను చూడడానికి ఎవరో వస్తున్నారటగా?"

"అవును...!" బాధకి బదులు ఆనందంతో కూడుకున్న సిగ్గుని ఆమెలో చూసేసరికి వుక్రోషం పెరిగిపోయింది.

"అతన్ని పెళ్ళిచేసుకుంటావా?"

''చిన్నపిల్లాడివి, నీకు ఈ మాటలన్నీ ఎందుకు? అవతలికెళ్ళు..."

మరుక్షణంలో ఇవతలికి వచ్చేశాను.

మాటిమాటికీ నన్ను చిన్నవాణ్ని చేస్తూ మాట్లాడే రాణితో మాటలు తగ్గించాలనుకున్నాను. ఆ రోజల్లా రాణిని తప్పించుకుతిరిగాను.

''ఎందుకు నన్ను తప్పించుకు తిరుగుతున్నావ్?" మర్నాడు నిలదీసింది.

"నువ్వు పెద్దదానివి. నీతో మాట్లాడడానికి నేనెంత..." కళ్ళ వెంట నీళ్ళు వచ్చేశాయి నాకు.

"ఛ...ఎందుకలా కన్నీళ్ళు పెట్టుకుంటావ్? ఇంకెప్పుడూ నీతో అలా మాట్లాడనులే. కన్నీళ్ళు తుడుచుకో..."

అంత కోపమూ, బాధ ఒక్కసారి గాలిలో కలిసిపోయాయి. మళ్ళీ ఇద్దరం కలిసిమెలిసి వుండసాగాం. స్కూల్‌నుంచీ రాగానే నేను వాళ్ళింటికి వెళ్ళేవాణ్ణి, లేకపోతే తను మా ఇంటికి వచ్చేది.

నెలరోజులు కూడా తిరగముందే మరో పిడుగులాంటి వార్త!

ఈ మధ్య రాణిని చూసి వెళ్ళిన వాళ్ళకి రాణి నచ్చింది! త్వరలోనే ముహూర్తాలు పెట్టుకోబోతున్నారు. కానీ రాణిలో నాకు దిగులు కనిపించ లేదు.

"నీకు దిగులుగా లేదూ?" అడిగాను.

"ఎందుకు?" ఎదురు ప్రశ్న వేసింది.

''పెళ్ళటగా?''

"పెళ్ళయితే ఎవరికైనా దిగులేస్తుందేమిటి, ఆనందంగా వుంటుంది గాని! అందుకే నిన్ను చిన్నపిల్లాడనేది!!" ఆరిందాలా మాట్లాడుతున్న ఆమె మాటలు నన్ను మరింత ఇబ్బందిపెట్టాయి.

తను పిలుస్తున్నా వినిపించుకోక ఇవతలికి వచ్చేశాను.

రాణిమీద వచ్చిన కోపం నానుంచి రాణిని వేరుచేయబోతున్న 'ఆ పెళ్ళికొడుకు' వైపుకి మళ్ళింది.

రాణి పెళ్ళి నిశ్చయమైపోయింది.

గుండెలు తరుక్కుపోసాగాయి.

రాణి నాకు దూరం కావడం లేదు. ఆ దుర్మార్గుడు దూరం చేస్తున్నాడు.

"ఎందుకు నన్ను తప్పించుకు తిరుగుతున్నావ్?" నిలదీసింది ఆ రోజు రాణి.

''నేనేంకాదు, నువ్వే నన్ను తప్పించుకు పారిపోతున్నావ్!'' కళ్ళ వెంట నీళ్ళు వచ్చేశాయి.

''అతన్ని పెళ్ళిచేసుకోనని మీ వాళ్ళకు చెప్పెయ్!''

''ఎందుకు? చూస్తూ చూస్తూ మంచి సంబంధం వదులుకుంటారా ఎవరైనా?"

"అది మంచి సంబంధమా?"

"ఏం? అతను నీకు నచ్చలేదా?"

''ఏం నచ్చలా...'' కోపం పెరిగిపోయింది నాలో.

''పో కొంటెపిల్లాడా!'' చిన్న మొట్టికాయ వేసి లోపలికి వెళ్ళిపోయింది.

పెళ్ళి దగ్గరపడుతున్నకొద్దీ దిగులు పెరిగిపోసాగింది. రాణిని సొంతం చేసుకోబోతున్న అతనిమీద కూడా పెరిగిపోసాగింది కోపం.

నా బాధని పట్టించుకునేవారు లేరు. అసలు రాణి పెళ్ళికి ఈ వూళ్ళోనే వుండకూడదనుకున్నాను. కానీ అమ్మ బలవంతంమీద వుండిపోవాల్సి వచ్చింది. కంటిముందు ఇంత ఘోరం జరిగిపోతున్నా చూస్తూ ఏడుస్తూ కూర్చునే పరిస్థితి కలిగేదికాదు.

మంచి జరుగుతున్నా, చెడు జరుగుతున్నా కాలం ఎవ్వరికోసమూ ఆగదు. రాణి 'అతని'తో అత్తారింటికి వెళ్ళిపోయింది. నేనూ కాలేజీ చదువులకి ఆ వూరు వదిలేశాను.

రాణి నా అడ్రసు తెలుసుకుని రెండు మూడు వుత్తరాలు రాసింది కాని నేనే జవాబీయలేదు కోపంతో!

నాకు శెలవులు ఇచ్చి నేను ఇంటికి వచ్చినప్పుడు రాణి వచ్చేది కాదు. రాణి వచ్చినప్పుడు నేను వెళ్ళేవాణ్ణికాదు.

మరో రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

ఇంటికి వెళ్ళినప్పుడల్లా అమ్మ చెబుతుండేది-రాణిని అతను ఎంతో ఆప్యాయంగా చూసుకునేవాడని, అతను ఈ మధ్య స్కూటర్ కొన్నాడని, ప్రమోషన్ వచ్చిందని...ఇలా ఎవేవో!

ఆ సంగతులు విన్నప్పుడల్లా వళ్ళు మండిపోయేది. అతనెవరు రాణి మీద ఆప్యాయత కురిపించడానికి అనికూడా అనిపించేది. అతను మోజుపడి కొనుక్కున్న ఆ స్కూటర్‌కి యాక్సిడెంట్ అయితే బావుండని కూడా తలపోసేవాణ్ణి. నా ఆలోచన్లు నాకే బాధనిపించేవి. అయినా అతని గురించి వ్యతిరేకంగా ఆలోచిస్తుంటే అదో తృప్తి!

ఆలోచనల్లో ఎంతో ఆనందాన్ని ఇచ్చిన విషయాలు, అనుకున్నట్లుగా జీవితంలో జరిగినా బాధిస్తాయి అనే విషయం ఆ రోజే నాకు తెలిసింది.

నా శాపనార్థాలవల్లే అలా జరిగిందేమోననే ఆలోచన కూడా నన్ను కలచివేసింది.

రాణి భర్త స్కూటర్ యాక్సిడెంట్‌లో చనిపోయాడు. నేను కోరుకున్నదే అది అయినా భరించలేకపోయాను. వెంటనే బయల్దేరాను.

నవ్వుతూ తుళ్ళుతూ కనిపించే రాణి బొట్టులేకుండా కళా విహీనమైన మొహంతో కనిపించేసరికి కడుపులో దేవినట్లయింది. కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి.

రాణిని అలా చూడలేక ఇవతలికి వచ్చేశాను. ఆమెకి అలా రగాలని అంతకుముందు ఎన్నోసార్లు వూహించినందుకు నన్ను నేనే ట్టుకున్నాను.

రాణి జీవితం అప్పుడే మోడువారిపోవడానికి వీల్లేదు. ఏంచేయాలి?

తీవ్రంగా ఆలోచించాను.

రాణికి దూరంగా వుండడం నాకూ కష్టమే. ఆఖరికి ఓ నిర్ణయానికి వచ్చాను. వెంటనే ఆ విషయం బయటపెడితే బాగుండదు. బలవంతాన ఓ నెలరోజులు గడిచాయి.

ఒక రోజున రాణి వంటరిగా కనిపించింది. ఇదే మంచి సమయం. ఎప్పుడూ నన్ను చిన్నపిల్లవాణ్ని చేసి మాట్లాడే రాణికి నేనెంత పెద్దవాణ్ణయ్యానో తెలియజెయ్యాలనే తపన పెరిగిపోయింది.

నెమ్మదిగా దగ్గరకి వెళ్ళాను.

పెరట్లో చెట్టుకింద ఆమెనలా చూస్తుంటే అశోకవనంలో సీతలా అనిపించింది. ఆ సీత భర్తకి దూరమై తపిస్తే ఈ సీత భర్తని కోల్పోయి పరితపిస్తోంది. నువ్వు ఎప్పుడూ ఒంటరిదానివి కాదు అని ఆమెకి చెప్పాలి.

"రాణీ..." నెమ్మదిగా పిలిచాను. తలెత్తి చూసింది.

తెల్లటి మొహం మరింతగా పాలిపోయింది.

ఊహూఁ...ఆమె మొహం ఎప్పుడూ కళకళలాడుతుండాల్సిందే!

"నీతో ఒక చిన్నమాట చెప్పాలని వచ్చాను..." ఉపోద్ఘాతాన్ని తగ్గించి వెంటనే విషయాన్ని చెప్పేయాలనుకున్నాను.

"ఏమిటి?" నూతిలోంచి వచ్చింది మాట.

"నీ జీవితం ఇలా మోడువారిపోవడానికి వీల్లేదు. వచ్చేనెలలో నా చదువు కూడా అయిపోతుంది. ఉద్యోగం రాగానే...నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను పెళ్ళిచేసుకోవాలని..." నసిగాను.

అంత బాధలోనూ చిన్నగా నవ్వింది రాణి.

"చిన్నపిల్లాడివి, నీకు తెలీదు. జీవితమంటే కథకాదు, సినిమాకాదు! నీకన్నా వయసులో పెద్దదాన్ని, విధవని చేసుకుంటే ముందుముందు ఎన్నో అనుకోని సమస్యల్ని ఎదుర్కోవలసి వస్తుంది. నా మంచికోసం నువ్వు ఎలా ఆలోచిస్తుంటావో, నీ మంచికోసం నేనూ అలానే ఆలోచిస్తుంటాను. ఇట్లాంటి పిచ్చి ఆలోచన్లు కట్టిపెట్టి బాగా చదివి మంచి మార్కులతో పాస్‌గా...అప్పుడు నేనే సెలెక్టుచేస్తాను నీకో మంచి పిల్లని!" రాణి చటుక్కున లోపలికి వెళ్ళిపోయింది. శిలాప్రతిమలా అలాగే నిలబడి పోయాను. *

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక)

# నిర్మల నిర్ణయం

ఊరంతా అలసి సొలసి నిద్రాదేవత వడిలో ఒదిగిపోయింది. కానీ నిర్మలకి మాత్రం కంటిమీద కునుకు రావడం లేదు. మస్తిష్కం నిండా ఆలోచనలే...!

తను ఎవరికోసం బతకాలి? ఎందుకు బతకాలి?

ఇది తనని పుట్టినప్పటినుంచీ వేధిస్తున్న సమస్యే!

ఏడు సంవత్సరాలు కూడా నిండకముందే తల్లిని కోల్పోయింది. అప్పటినుంచే బరువు బాధ్యతలను మోయడం అలవాటైపోయింది. ఇంటి పన్లు, వంటపన్లతో పాటు మూడేళ్ళ చెల్లెలి ఆలనా పాలనా చూడటం కూడా తన దినచర్యలో భాగమైపోయింది.

ఉన్నట్టుండి తండ్రి ఒకావిడని ఇంటికి తీసుకొచ్చాడు. పని తగ్గుతుందని సంతోషించింది.

కానీ అప్పటినుంచీ పని ఎక్కువైంది దానితోపాటు సాధింపులు, చివాట్లు కూడా ఎక్కువైపోయాయి.

'కొత్తమ్మకి తనంటే ఎందుకంత కోపమో!' అర్థమయ్యేది కాదు. ఎంత పని చేసినా తృప్తిపడేది కాదు. తండ్రి రాగానే ఏమేమో చెప్పేది.

అంతే! దెబ్బలు... వళ్ళు వాచిపోయేది...!

చచ్చిపోవాలనే ఆలోచన మొదటగా అప్పుడే వచ్చింది తనకి. కానీ తను చనిపోతే చెల్లెలు ఆలనా పాలనా చూసేది ఎవరు? ఈ ఆలోచన చనిపోవాలనే కోరికకి కళ్ళెం వేసింది.

పదేళ్ళు కళ్ళు మూసుకుంటే పెళ్ళి సాకుతో ఈ ఇంటిని వదిలి వెళ్ళిపోవచ్చు. అప్పుడు చెల్లెల్ని కూడా తనతో తీసుకువెళ్తుంది. చక్కగా చదివిస్తుంది. తనకి తానే సమాధానపరచుకుంది. ఓదార్చుకుంది. ధైర్యం చెప్పుకుంది.

భారంగా రోజుల్ని వెళ్ళదీయసాగింది.

అదృష్టం కలిసొచ్చింది. తను అనుకున్నట్లు పది సంవత్సరాల దాకా ఆగకుండానే ఆ ఇంటిని వదిలి వెళ్ళిపోయే రోజు వచ్చింది. అంత వరకూ ఎన్ని కష్టాలనయినా భరించిందే గాని, చెల్లెలి చదువుకి ఎటువంటి ఆటంకం రానీయలేదు.

రాజారావ్ తనంతట తానే పెళ్ళి చేసుకుంటానని రావడంతో కష్టాలన్నీ గట్టెక్కిపోయాయని సంతోషపడింది. చెల్లెల్ని కూడా తనతో తీసుకొచ్చి చదివించుకుంటానని అడిగింది అతన్ని. అతను ఒప్పుకున్నాడు. తను ఆనందంతో కదిలిపోయింది.

ఖర్చులేకుండా గుండెలమీద కుంపటి తొలగిపోవడమే, చెల్లెల్ని కూడా తనతో తీసుకుపోతాననడంతో మురిసిపోయారు తల్లిదండ్రులు.

పెళ్ళి జరిగిపోయింది...

ఆ వాతావరణాన్ని ఛేదిస్తూ కుక్కలు అరవడంతో ఆలోచనలోంచి బయటికి వచ్చింది నిర్మల.

ఇటు తిరిగింది. హాయిగా నిద్రపోతున్న మనవడు. వాడికి మెళకువ వచ్చి మంచం దిగి వీధి వాకిట్లోకి వెళ్ళాడు.



'అంధకారం...తన జీవితం ఒక అంధకారం!' విరక్తిగా నవ్వుకుందామె.

అంధకారానికి, తన జీవితానికి మొదటినుంచీ అవినాభావసంబంధం వుంది.

పెళ్ళైన కొత్తల్లో ఆయన చాలా బాగా వుండేవారు. క్రమక్రమంగా మార్పు రాసాగింది. తన నీడ చూస్తేనే చిరాకు పడిపోయేవారు.

అప్పుడు తెలిసింది అసలు విషయం - అంతకుముందే ఆయనకి ఓ సంబంధముందని!

ఏ అర్ధరాత్రో, అపరాత్రో ఇంటికి వచ్చేవారు.

అంతవరకూ ఇలానే వీధిలో నిలబడి అంధకారంలో ఆయనకోసం వెదుకుతుండేది.

చెల్లెలి చదువుకి మధ్యలో ఎక్కడ అంతరాయం వస్తుందోనని కుక్కిన పేనులా అన్నీ భరించేది తను.

ఆఖరి సంవత్సరం పరీక్షలు రాసిన రోజున మరో యువకుడితో ఇంటికి వచ్చింది చెల్లెలు. ఇద్దరూ ప్రేమించుకున్నారని ఆమె చెప్తే, పెళ్ళి చేసుకుందామనుకుంటున్నామని అతను చెప్పాడు ఆనందాన్ని వ్యక్త పరుస్తూ.

ఆశీర్వదించింది తను.

అంతవరకూ ప్రాణానికి ప్రాణంగా పెంచుకున్న చెల్లెలు ప్రేమ వంకతో తనకు దూరంగా వెళ్ళిపోయింది, పెళ్ళి చేసుకుని.

తను వంటరిదై పోయింది. అప్పుడు అంధకారమే తనకి తోడుగా నిలిచిపోయింది.

కొత్తమ్మ కారణంగా తండ్రి దూరమయ్యాడు. ఈవిడెవరో కారణంతో భర్త దూరమైపోయాడు. తన కన్నీళ్ళు కరిగించలేని పాషాణం ఆయన మనసని తనకి తెలుసు. అయినా చెల్లెల్ని చూసుకుంటూ రోజుల్ని నెట్టుకొచ్చింది. ఇప్పుడు తన అవసరం తీరిపోయి చెల్లెలూ దూరంగా వెళ్ళి పోయింది. ఇంకెందుకు బ్రతకాలి? ఈ వంటరి ప్రయాణాన్ని ముగిస్తే బావుంటుంది!

ఆత్మహత్యే తన కష్టానికి పరిష్కారమని నిశ్చయించుకున్న రోజునే తన చెవినిబడింది వార్త.

తల్లి కాబోతోంది తను!

వళ్ళు పులకరించింది.

తను వంటరిదికాదు. తన ప్రాణానికి ప్రాణంగా శరీరంలో ఓ భాగం ప్రాణం పోసుకుంటోంది! తన ప్రాణంతోపాటు వాడి ప్రాణంతీసే హక్కు తనకి లేదు.

ఆ ప్రయత్నాన్ని విరమించుకుని ప్రేమనంతా పుట్టబోయేవాడి మీదే కేంద్రీకృతం చేసుకుని రోజులు గడపసాగింది.

రాజు ఈ లోకంలోకి వచ్చాడు. వాడికి మొదటినుంచీ తండ్రిమీద కన్నా తనమీదే ఎక్కువగా అభిమానముండేది.

చదువులో వాడెప్పుడూ ఫస్టే! చదువులో వాడు చకచకా పైకిరావడంతో తనెంతో ఉప్పొంగిపోయేది. ఆ ఆనందంలో ఆయన పూర్తిగా దూరమైపోయినా కూడా తను లక్ష్యపెట్టలేదు.

రాజు మంచి ఉద్యోగంలో స్థిరపడ్డాడు. వాడికి అన్ని విధాలా సరిజోడయిన పిల్లని తేవాలని తనెంతో తహతహలాడింది. ఫలితంగా రుక్మిణి కోడలైంది.

ఏరి కోరి తెచ్చుకున్న కోడలే తన ఆశల్ని ఛిన్నాభిన్నం చేస్తుందనుకోలేదు.

మొదట్లో తనంటే అభిమానంగానే వుండేది. కానీ భర్త అభిమానంలో ఎక్కువ భాగం తల్లికే వెచ్చిస్తున్నాడనే అనుమానం ఆమెలో మార్పు తీసుకురాసాగింది. ఆ సంగతి గ్రహించీ మిన్నకుండాల్సిన పరిస్థితి అయిపోయింది తనది.

తానేం మాట్లాడినా వేరే అర్థాలు వెదకడం, నానా గోలా చేయడం ఇప్పుడామె పని!

—కొడుకు కోడలు పడుకున్న గదివేపు చూసి నిట్టూర్చింది నిర్మల.

అడకత్తెరలో పోకచెక్కలా తయారైంది వాడి పరిస్థితి. అందుకే కాబోలు ఈ మధ్య ఇంటిని పట్టించుకోకుండా తిరగడం మొదలు పెట్టాడు.

వీడూ తండ్రిలా కాకూడదు. చక్కగా సంసారం చేసుకోవాలి. వాళ్ళ మధ్యలో తనుండకూడదు.

ఓ నిర్ణయాని కొచ్చింది నిర్మల.

సరాసరి తను పడుకున్న మంచం దగ్గరకి వచ్చింది. మనవడు ఇంకా తను పక్కనే పడుకున్నాదనుకుని పక్కకు తిరిగి హాయిగా నిద్ర పోతున్నాడు.

వాణ్ణి అలా చూడగానే నిర్మల మనసు చలించింది. అయినా మరు క్షణం మనసుని రాయిచేసుకుంది.

దుప్పటి మెడవరకూ కప్పి వాణ్ణి ముద్దాడింది.

గబగబా పెరటివేపు బయల్దేరింది.

మరికొద్ది క్షణాల్లో పెరట్లో వున్న బావిలో తన శవం తేలుతుంది ఈ ఇంటికి పట్టిన శని తొలగిపోతుంది.

దృఢ నిశ్చయంతో ముందుకు పడుతున్న ఆమె కాళ్ళు వెనకనుంచీ మనవడి ఏడుపు వినిపించగానే ఠక్కున నిలిచి పోయాయి.

వెనక్కి తిరిగింది.

కళ్ళు నులుముకుంటూ "బామ్మా!" అని ఏడుస్తున్నాడు వాడు

తల్లిని విడిచిపెట్టయినా వాడుండగలడుగాని తననని విడిచిపెట్టి వుండలేడు. మొదటినుంచీ తనంటే వాడికెంత ప్రేమో! తను చనిపోతే వాడు వుండగలడా?

"బామ్మా..." ఏడుపు పెరిగింది.

ఊహూఁ... తను చనిపోదు. వాడికోసమైనా బ్రతికుంటుంది చటుక్కున వెనక్కి తిరిగి పరుగున మంచం దగ్గరకి వెళ్ళి మనవణ్ణి వళ్ళోకి తీసుకుని ముద్దాడ సాగింది నిర్మల గడ్డిపోచలా అందిన మరో ఆశని మనసునిండా నింపుకుంటూ.

(ఈ వారం వారపత్రిక

# రాజీ

ఉదయం నుంచీ ఒకటే వర్షం. ఎడతెరిపి లేకుండా కురుస్తోంది. రోడ్లన్నీ నీళ్ళతో నిండిపోయాయి.

భవాని కిటికీ దగ్గర కూర్చుని ఇంటిబయట ప్రవహిస్తున్న వర్షపు నీటిని చిన్నపిల్లలా మైమరచి చూస్తోంది. ఇప్పుడే కాదు, చిన్నప్పటినుంచీ కూడా అదే కిటికీ దగ్గర కూర్చుని ధారగా కురుస్తున్న వర్షం చూడడ మంటే ఇష్టం భవానికి. ఎందుకో తెలీదు. ఈ విషయం చెప్పినప్పుడల్లా తన స్నేహితురాలు ఇందిర ఆశ్చర్యపోతుండేది.

"అదేమిటి? వర్షం అంటే ఇష్టపడేవాళ్ళని నిన్నొక్కర్తెనే చూశాను" అనేది ఆశ్చర్యంగా చూస్తూ. నిజానికి దానికి మాత్రం వర్షమంటే చెడ్డ చిరాకు.

కొద్దిపాటి వర్షం కురిసినా "అబ్బ! పాడువాన! ప్రాణం తీసేస్తుంది!" ఒకటికి పదిసార్లు విసుక్కొంటుండేది.

భవాని ఆలోచనలన్నీ ఇందిర మీదకి మళ్ళాయ్ - సరిగ్గా నాలుగేళ్ళయింది దానికి పెళ్ళై. భర్తతో వైజాగ్‌లో వుంటోందిప్పుడు. అప్పుడప్పుడూ తనకి ఉత్తరాలు రాస్తూనే వుండేది. ఆమె రెండోసారి గర్భవతిగా వున్నప్పుడాఖరి ఉత్తరం రాసింది. అంతే! ఆ తరువాత ఉత్తరం లేదు. బహుశా ఈ పాటికి ఏ పాపనో, బాబునో కని, చూసుకొని మురిసిపోతుంటుంది. నిరాశగా నవ్వుకొంది భవాని. తనకు కూడా నాలుగేళ్ళ క్రితమే వివాహమై ఉంటే తనూ ఇద్దరు పిల్లల తల్లి అయ్యేది. తనూ ఓ

ముద్దుల పాపనెత్తుకొని ముద్దాడుతూండేది. ఎందుచేతో తెలీదు. కాని, తనకి చిన్న పాపాయిలంటే ఎంతో ఇష్టం. కనబడ్డ పాపాయినల్లా వదలకుండా ముద్దాడుతుంటే బంధువులంతా "నీకూ ఓ రోజు పాపాయి పుడుతుందిలే" అంటూ పరిహసించేవాళ్ళు. పైకి వాళ్ళలా అన్నందుకు బుంగమూతి పెట్టినా, లోలోపల ఆ మాటలు ఆనందాన్ని కలిగించేవి. నిజంగానే "ఓ పాపని కని తన కోరిక తీర్చుకునే రోజెప్పుడు వస్తుందో'' అని కలలు కనేది. కానీ తను దురదృష్టవంతురాలు. అందుచేతే తన చదువూ ఆగిపోయింది. తనకు వేలకి వేలు పోసి వివాహం చేసే స్తోమత తల్లితండ్రులకు లేకపోవడంతో పెళ్ళి కాలేదు. ధ్యేయం లేని జీవితం గడుపుతున్నట్లనిపిస్తోంది తనకి.

వర్షం తగ్గింది. సన్నని తుంపర పడుతోందంతే. రోడ్డుమీద మళ్ళీ రాకపోకలు మొదలయినాయ్. పిల్లలు కొంతమంది ఇంటిముందు నిలిచిన మోకాటిలోతు నీళ్ళలో ఉత్సాహంగా ఆడుస్తూ గెంతుతున్నారు. ఆ నీళ్ళలోనే నెమ్మదిగా వచ్చి మెట్ల ముందాగిన రిక్షాని ఆశ్చర్యంగా చూసింది భవాని. ఈ వర్షంలో తమింటికి వచ్చేరెవరై ఉంటారు?

వర్షం పడకుండా అడ్డుకట్టి కట్టిన కాన్వాస్ గడ్డని తొలగించుకొని దిగి నుంచున్న ఇందిరను, ఆమె రెండేళ్ళ కొడుకుని చూసి ఉప్పొంగిపోయింది భవాని.

ఒక్క ఉదుటున లేచి బయటకు పరుగెత్తిందామె. ఓ చేత్తో పాపనెత్తుకొని, మరో చేత్తో బాబును నడిపించుకుంటూ లోపల కొస్తున్న ఇందిరని "నీకు నూరేళ్ళాయుష్షే!" అంటూ ఆనందంగా పలుకరించింది భవాని.

"ఎందుకనో?"

"ఇప్పుడే నిన్ను తలుచుకొన్నాను. ఇంతలో రిక్షా దిగావ్! ఇంతకూ ఎపుడూ రావడం?" అడిగింది భవాని.



"మా అత్తగారి వూరెళ్ళి వారమయ్యింది. అక్కడి నుంచి నిన్ననే మా అమ్మ వాళ్ళింటికి వచ్చాను." నవ్వుతూ అంది ఇందిర.

ఆమె చేతిలోని పాపనందుకొని ముద్దు పెట్టుకొంది భవాని. తెల్లగా, బొద్దుగా ఎంతో ముద్దొస్తుంది పాప.

"దీన్ని నేను వుంచుకుంటానే" పాపాయిని గుండెలకు హత్తుకొంటూ అంది భవాని.

"దీన్ని చూస్తే ఇలాగే అంటావని నేను ముందే అనుకొన్నాను." నవ్వుతూ అంది ఇందిర.

ఇద్దరూ లోపలికి నడిచి కుర్చీలో కూర్చున్నారు.

"పెళ్ళెప్పుడే? త్వరగా చేసుకుంటే నువ్వూ ఓ పాపని కనెయ్యొచ్చుగా!" అడిగింది ఇందిర మాటల్లో.

"అవున్లే, అదేదో సామెత చెప్పినట్లుంది." నవ్వేస్తూ అంది భవాని పాప తల్లి చంకలోంచి ముందుకు వంగి బాబు చేతిలో ఉన్న బొమ్మ కావాలని మారాం మొదలుపెట్టింది.

"నాకేం! నేనివ్వను." బాబు పెంకిగా అన్నాడు.

పాప ఏడుపు మొదలుపెట్టింది.

"పాపాయి చిన్నది కదమ్మా! ఆ బొమ్మ ఇచ్చేసెయి. మనము ఇంకోటి కొనుక్కుందాము." లాలించి ఆ బొమ్మని తీసుకుని పాపాయి కిచ్చింది ఇందిర.

"అన్నిటికీ పేచీయేనే ఇద్దరితోనూ! వాడికేదైనా కొనిస్తే ఇ గొడవ, దీనికేదైనా కొనిస్తే వాడు గొడవ." నవ్వుతూ అందామె.

"చిన్నప్పుడు ఎవరు మాత్రం పోట్లాడుకోరే!" భవాని మామూలుగ అయితే అనేసింది... కానీ, వెంటనే ఆమెకు తన చిన్నతనం తక్కు కళ్ళముందు కొచ్చింది.

తానూ అక్కయ్య రమణి ఇద్దరూ ఇద్దరే పిల్లలు తమ తల్లిదండ్ర లకు. కానీ, తమాషా ఏమిటంటే తానెప్పుడు అక్కయ్య వస్తువులు కావాలి గొడవ చేసేది కాదు, వద్దని ఏడుస్తుండేది. దానికి కారణం ఉంది.

అయిదో క్లాసు వరకూ తనకు ఊహ సరిగ్గా తెలియదు. అంతవరక అక్కయ్యకు బిగుతైన బట్టలు తను వేసుకుంటూ వచ్చింది. అక్కయ్య చిన్నవైన చెప్పులు తనే వేసుకోవాలి. అక్కయ్యకి కొత్త రిబ్బన్లు కొంటే తనకి అక్కయ్య వాడిన పాత రిబ్బన్లు వచ్చేవి.

తన తల్లిదండ్రులలా చేయడానికి కారణం తన మీద ప్రేమ లే కాదు, అయిష్టమూ కాదు, అక్కయ్యంటే ఏ పక్షపాతమూ లేదు. కేవలమ ఆర్థిక పరిస్థితులే అలాంటి పద్ధతులకు పురిగొల్పినయ్.

అయిదో క్లాసు పాసయింతరువాత మొదటిసారిగా గొడవ చేసింది ఆరో క్లాసులో మిగతా పిల్లలందరిలాగానే తానూ కొత్త పుస్తకాలు కొనుక్కో వాలని ఉవ్విళ్ళూరింది.

తీరా నాన్న అక్కయ్య పుస్తకాలే మళ్ళీ బైండ్ చేయించి తీసుకొచ్చేసరికి తనకి ఉక్రోషం ముంచుకొచ్చింది.

"నాకు కొత్త పుస్తకాలు కావాలి. ఈ పాతవి వద్దు" అంటూ మారాం చేసింది.

తనకి బాగా గుర్తుందా రోజు.

తల్లీతండ్రీ బ్రతిమాలారు, బుజ్జగించారు. ఇన్ని చేసినా తనూరుకోలేదు. ఆ రాత్రి అన్నం తినకుండా ఏడుస్తూ కూర్చుంది. చివరికి విసిగిపోయిన తల్లి తనని చావు దెబ్బలు కొట్టింది. ఆ తరువాత ఆమె కూడా ఏడ్చేసింది అంతగా కొట్టినందుకు.

చివరికి రాజీపడకా తప్పలేదు, ఆ పాత పుస్తకాలు చదవకా తప్పలేదు.

ఆ సంవత్సరం దీపావళి పండక్కి మళ్ళీ - అక్కయ్యకి కొత్త గౌను, తనకి అక్కయ్యకి బిగుతైన పాత గౌను. అందరి పిల్లల్లాగానే కొత్త బట్టలు తొడుక్కోవాలన్న వుత్సాహం నీరు కారిపోయింది.

ఆరోజు అంతా ఏడుస్తూ కూర్చుంది. పాత గౌను విసిరి కొట్టింది.

తల్లిదండ్రులు మామూలుగానే బ్రతిమాలారు. ఆ గౌను కాస్త ఖరీదైనదీ, ఇంకా ఏ మాత్రం చిరగనిదీ కావడంతో తనెంత గొడవ చేసినా దాన్నే వేసుకొమ్మన్నారు. ఆ రోజు రాత్రి తనకి అన్నం లేదు.

ఆ తర్వాత మామూలే! రాజీ పడిపోయింది పాత గౌనే వేసుకొని స్కూలుకెళ్ళింది. ఆ తర్వాత అవేకాదు. ప్రతి విషయంలోనూ-అక్కయ్య పావడాలూ, లంగాలూ, చీరలూ, జడకుప్పెలూ, గాజులూ- అక్కయ్య పెళ్ళయ్యే వరకూ అన్నిటికీ రాజీపడాల్సి వచ్చింది. కోరికలకు కళ్ళాలు వేయాల్సి వచ్చింది.

అక్కయ్య అత్తగారింటికి ఎపుడు వెళ్ళిపోతుందా! అని వేయికళ్ళతో ఎదురు చూసింది తను. ఆమె వెళ్ళిపోతే ఇంట్లో తనొక్కర్తే. అపుడు తనక్కావలసినవన్నీ కొత్తవే కొనుక్కోవచ్చు. కొనగలిగే తాహతు లేక

పోతే కొనకుండా వూరుకోవచ్చు. అంతేగాని పాత వ
అవసరం ఇక వుండదు.

రమణ అత్తవారింటికి వెళ్ళిపోయింది. తనెంతో చూసిన ఆ రోజు తనకెందుకో వుత్సాహాన్ని కలిగిం నిర్లిప్తత. తీరా ఆమె వెళ్ళిపోయాక కోరికలే లేకుం

కొత్త బట్టలు, కొత్త గాజులు, కొత్త సవ కొనుక్కోవాలన్న తన కోరిక, వుత్సాహం అంతులేకు

ఆ వయస్సు వేరు, ఆ ముచ్చట్లు వేరు. ముచ్చట్లు ఆ వయస్సులోనే జరగాలి. ఈ వయస ఈ వయస్సులో జరగాలి... ఏమిటి ఆలోచనలో అడిగింది ఇందిర.

చటుక్కున స్పృహలోకొచ్చింది భవాని. త సిగ్గేసింది. "అలా డాబా మీదకి వెళ్ళికుర్చుందాం ప తగ్గిపోయిందిగా!" ఉత్సాహంగా అంది ఇందిర. చేరుకున్నారు.

చదువుకొనే రోజుల్లో ఇద్దరూ ఎన్నో సాయం కబుర్లు చెప్పుకుంటూ గడిపారు. తను అన్నీ అక్కయ ఇందిర తనని "సెకండ్ హాండ్" అని ఏడిపిస్తుండే

సాయంత్రపు నీరెండ కాస్తోంది, ఓ పక్క ధనుస్సు... "ఏమే సెకండ్ హాండ్! ఏంటీ విశేషాలు? నవ్వుతూ.

భవానికూడా నవ్వు వచ్చింది.

"ఇపుడు నేను సెకండ్‌హాండ్‌ని కాదు లేచే పోయిందిగా!"

"అవునే! మీ అమ్మా నాన్నలకి నువ్వింకా కనబడుతున్నావా ఏంటి ఖర్మ - పెళ్ళెప్పుడు చేస్తారంట?

చూస్తూనే వున్నారే - కట్నాలకి తూగలేక-

"ఓహో" అర్థమైందన్నట్లు తలెగరేసింది ఇందిర.

"పోనీ, ఎవరైనా ప్రేమించి పెళ్ళి చేసుకోలేకపోయావా?" నవ్వుతూ మళ్ళీ తనే అడిగింది.

భవాని వులిక్కి పడింది.

"ఏమే! ఈ మాటలు వూరికే అన్నావా? లేకపోతే నా గురించి ఎవరైనా ఏమైనా చెప్పారా?" చకితురాలై అడిగింది భవాని

"అంటే నిజంగానే ఏమయినా గొడవుందా ఏంటి?" నవ్వేస్తూ అంది ఇందిర.

భవాని నవ్వింది.

"నీతో ఓ విషయం చెప్పాలే!" తటపటాయిస్తూ అంది.

"ఏమిటి?"

"ఓ చిన్న ప్రేమ కథ."

"ప్రేమ కథా! ఎవరిది?"

"నాదే..." సిగ్గుపడిపోయింది భవాని.

"అమ్మ దొంగ! ఇంతసేపు నాదగ్గర దాచేవన్నమాట! ఎవరతను?"

"అదిగో ఆ డాబాలేదు - అందులో అద్దెకి దిగారు ఈ మధ్యే - "

"ఎదురింటి అబ్బాయన్నమాట! బావుంది. ఏమైనా వుద్యోగం చేస్తున్నాడా?"

"స్టెనోగా వర్క్ చేస్తున్నాడు."

"ఇద్దరికి ఎలా కలిసింది?"

"ప్రతిరోజు సాయంత్రంపూట డాబామీద కాసేపు కూర్చోవడం అలవాటైపోయింది కదా! అతనూ అదే సమయానికి వాళ్ళ డాబామీద కనిపించడం మొదలుపెట్టాడు. అంతే! అది చాలా దూరం వచ్చేసింది."

"మరయితే పెళ్ళెప్పుడు?"

"అక్కడే వచ్చి పడింది గొడవ."

"అదేం...?"

"మామూలు అన్ని మధ్యతరగతి కుటుంబాలక అతనికి వున్నాయి-పెళ్ళికాని చెల్లెళ్ళు, కట్నాలివ్వలేని వగైరా, వగైరా."

"మరేం నిర్ణయించుకున్నారు?"

"పరిష్కారం ఇద్దరివల్లా కాక అలా గాలికొదిలే

"బావుంది." నిట్టూరుస్తూ అంది ఇందిర.

మరి కాసేపు కూర్చొని బయల్దేరింది ఇందిర. ఆ వరకూ వచ్చింది భవాని.

"ఇంక వెళ్తానే-నీ పెళ్ళికి పిలవడం మరచిపో సంగా అందామె.

"బావుంది. పెళ్ళి పెద్దవే నువ్వైతే మరచి పో

ఇందిర వెళ్ళిపోయింది.

వెళ్ళిన రెండు నెలలకి ఆమెకు భవాని పెళ్ళి శుభ

*　　*　　*

"పాడు వర్షం-మీ అక్కయ్య పెళ్ళికీ ఇలాగే కు అంది శాంతమ్మ. భవాని కిటికీ దగ్గర కూర్చొని బయ ఎడతెరపి లేకుండా కురుస్తున్న వర్షాన్ని చూస్తోంది. పెడ నిండిపోయింది. వర్షం మూలాన వివాహాని కెక్కువ రాలేదు. వచ్చిన వాళ్ళలో చాలామంది సూత్రధారణ పోయారు.

భవాని అలా చూస్తుండగానే చీకటి పడింది.

అక్కయ్య పిల్లలు ఆడుకుంటున్నారు కాబోలు. హడావిడిగా వుంది.

"భవానీ! ఇంకా అలానే కూర్చున్నావా? ఇది మొదటి రాత్రి అన్న సంగతి మర్చిపోయావా ఏంటి ఖర్మ! ఇలారా - జడవేస్తాను." పిన్ని వచ్చి ఆమెను చెయ్యిపట్టుకు లాక్కుపోయింది.

మరికొద్ది సేపట్లో ఆమె అలంకరణ పూర్తయింది.

"పిన్నీ! ఎక్కడికెళ్తున్నావ్, సినిమాకా?" భవానున్న గదిలోకొచ్చి అడిగాడు అక్క మూడేళ్ళ కొడుకు.

''కాదురా! ఎక్కడికీ వెళ్ళడం లేదు.'' జీవంలేని నవ్వుతో వాడిని దగ్గరకు తీసుకొంది భవాని. ఆమె చేతుల్ని సున్నితంగా విడిపించుకుని వాడు మళ్ళీ మిగతా పిల్లలతో ఆడుకోడానికి తుర్రుమన్నాడు.

టైమ్ గడచిపోతోంది. అంత చీకట్లోనూ వర్షం పడటం కనబడుతూనే వుంది భవానికి. ఆమెకు తెలియకుండానే కళ్ళవెంట నీళ్ళు ధారగా కారిపోతున్నాయి. అలా ఎంతసేపు గడచిపోయిందో కూడా తెలీదు.

"పద" అంటూ ఒకరు ఆమెని శోభనపు గదిలోకి తీసుకెళ్ళారు. తలుపులు మూసుకుపోయినయ్.

"రా భవానీ!" ఇలా వచ్చి కూర్చో..." అని భుజంమీద చెయ్యి వేసి అన్నాడు రాజారావు.

మంచంమీద అతని ప్రక్కనే కూర్చుండిపోయింది భవాని. ఆమెను దగ్గరకు లాక్కుని పెదాలమీద ముద్దు పెట్టుకున్నాడతను. భవానిలో ఆ చర్య ఎలాంటి చలనాన్నీ కలిగించలేదు.

''అలా వున్నావేం భవానీ! చేసుకున్న పెళ్ళికి పశ్చాత్తాపపడడం లేదు కదా? నిజానికి అసలు ఈ వివాహం నాకూ ఇష్టంలేదు భవానీ! కానీ పిల్లల కోసం. అదీ నువ్వైతేనే వాళ్ళ ఆలనా పాలనా బావుంటుందని మీవాళ్ళు బలవంతం చేసేసరికి..."

''లేదు బావా! లేదు...'' తడబడింది భవాని.

"పశ్చాత్తాప పడ్డా లాభమేముంది బావా! అక్కయ్య కోసం ఏర్పరచిన వస్తువులే నాకు దక్కాలని దేవుడు నా నుదుట రాశాడు. ఆఖరికి భర్త కూడా అక్కభర్తే! అందుకేనేమో అక్కయ్యని ఆయుష్షు తీరకుండానే తీసుకెళ్ళిపోయాడు." అనాలనుకున్న మాటలు పెదాలు దాటి బయటికి రాకుండానే ఆగిపోయాయి భవానికి.

"నీకో విషయం చెప్పాలి భవానీ!"

తలెత్తి అతని వంక చూసింది.

"చెప్పు బావా! ... "

"నీకే విధమైన లోటూ చేయను భవానీ! మీ అక్కయ్యనెంతో అపురూపంగా చూసుకున్నాను. ఎన్నో విలువైన వస్తువులు కొన్నాను. అవన్నీ ఇప్పుడు నీవే! కానీ ఒకే ఒక్క విషయంలో నీకన్యాయం చేశాను భవానీ! అదీ కావాలని చెయ్యలేదు. మీ అమ్మా నాన్నగార్ల కోరిక మీదే దాచానా విషయం..."

భవాని వూపిరి బిగపట్టి వినసాగింది,

"ఇద్దరు పిల్లలు పుట్టగానే నేను ఆపరేషను చేయించుకున్నాను భవానీ! ఇంతలోనే ఇంత ఘోరం జరిగిపోతుందని ఏనాడూ వూహించలేదు. ఇంక ఆ పిల్లలే నీ పిల్లలు. ప్రతి స్త్రీ మాతృత్వాన్ని కోరుకుంటుందనీ, తన కన్న పిల్లల్ని పెంచాలన్న మమకారం ఆమెకుంటుందనీ..."

భవాని నిశ్చేష్టురాలైపోయింది గాని వెంటనే తేరుకుంది.

"ఫరవాలేదు బావా! నేనేం బాధపడడంలేదు. జీవితంతో రాజీ పడడం చిన్నప్పుడే నేర్చుకున్నాను. చిన్నప్పటినుంచీ అంతే బావా! అక్కయకి సంబంధించిన వస్తువులన్నింటికీ నేనే వారసురాల్ని. ఆఖరికి ఇపుడు అక్కయ్య భర్త, పిల్లలకి కూడా" ఆమె దుఃఖం ఆగలేదు.

ఆతని కౌగిట్లో కరిగిపోయి ఉప్పెనలా ఏడ్వేయసాగింది.

(మార్చి 1979 - యువ)



## వేదగిరి రాంబాబు

## 'సముద్రం'

1952 అక్టోబర్ 14న గుంటూరు జిల్లా మందూరులో పుట్టిన వేదగిరి రాంబాబు 1970 లో కృష్ణా జిల్లా మచిలీ పట్టణంలో బియస్సీ చదివే రోజుల్లో శ్రేయోభి లాషులు శ్రీయుతులు విహారి, అది విష్ణుల ప్రోత్సాహంతో కథా రచనకి శ్రీకారం చుట్టారు.

హైద్రాబాద్‌కి చేరుకున్న తర్వాత ఆప్తమిత్రులు యర్రం శెట్టి శాయిగారి సాహచర్యంలో ఎన్నో కథల్ని రాశారు. దాదాపు రెండు వందల యాభైకి పైగా కథలు అన్ని వార, మాస పత్రిక లలోను ప్రచురితమయ్యాయి. కొన్ని అకాశవాణి, దూర ర్శన్‌ల ద్వారా ప్రసార ుయ్యాయి. వాటిలో కొన్ని ుర భాషల్లోకి అనువదించ బడ్డాయి. ప్రచురితమైన కథల్లో మాకు బాగా నచ్చిన, మీకునచ్చుతాయనుకున్న పది హేను కథల సంకలనం ఈ 'సముద్రం'!

